87

# MARRIAGE GREETINGS.

OF

SREE RAJA

## VADREVU VISWASUNDARA RAO,

BAHADUR, ZAMINDAR OF VEGAYAMMAPETA

GODAVARI Dt.

MANJUVANI PRESS; ELLORE.

1911.

PRINTED & PUBLISHED BY N. CHALAPATI RAO.

శ్రీ

మార్కండేయస్వామినేనమః.

శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరు

# వివాహ మహోత్సవాశీర్వచన

## పద్యరత్నావళి.

Vivaha Mahostsavaseervachana

పలువురు పండితుల సంగ్రహము


ఏలూరు

మంజువాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రకటింపబడియె.

1911.

శ్రీ

# మార్కండేయ స్వామినేనమః.

శ్రీ నాదెండ్ల విశ్వాస [illegible] జమీందారుగారి

# వివాహ మహోత్సవాశీర్వచన పద్యరత్నావళి



## విషయసూచిక.



Sree Rajah Vadrevu Viswasundara Rao,

శ్రీ

## మార్కండేయ స్వామినే నమః.

శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరు జమీందారుని

# వివాహ మహోత్సవాశీర్వచన పద్యరత్నావళి.

పీఠిక.

---

శ్లోకము.

శ్రీమద్ధ్యాయామి మిథ్యా చకచకవికచ చ్చైత్య సత్యస్వరూపమ్
హృద్యం స్వస్థానివేద్యం శ్రుతిమహితసతీభాగ్య సౌభాగ్యకందమ్
సిద్ధం సర్వానువిద్ధం పరమశివమయం భవ్యదివ్యప్రకాశమ్
మార్కండేయేశ్వరాఖ్యం నతజనసుఖదం భాగధేయం మదీయమ్.

చ. సిరిగల వాడ్రేవు కుల శేఖరమై తగు రంగనాయికా
వరసతి దత్తపుత్త్రుఁడయి వాసిగహించిన విశ్వసుందరా
హ్వారమణ సద్గుణాంచితుఁడు వడ్లమనాటి కుశాలురామజ౯
సురుచిరగాత్రియౌ త్రిపుర సుందరిఁ బాణి గ్రహించె నెమ్మితో౯ 2

క. బందరు పురమున మిక్కిలి
సుందరులగు వారి పెండ్లిఁ జూడ ముదముతో
నిందు౯ గంజము మొదలుగ
నందుం జెన్నపురిదనుక నరిగిరనేకుల్ 3

ఉ. పెండిలినాఁటి యుత్సవము◆పెంపును సొంపును జెప్పగిప్పరా
దొండుకడం గవీశ్వరులు◆నొక్కెడ సర్వకళాధురీణులౌ
పండితులొక్కె దిక్కున ని◆వాళియలిచ్చుచుఁ గన్నుదోయికిం
బండువసేయ నింతులును◆బర్విరి క్రిక్కిఱియంగ నయ్యెడన్ 4

చ. అలయికకోర్చి దూర మన◆కాదరమాత్మల నుప్పతిల్లఁగా
బలువురుకోవిదుల్ వివిధ◆పాండితినొప్పు కవుల్ దయల్ మది
న్వెలయన మోఘవాక్య సర◆ణిందగ దంపతులుల్లసిల్లఁగాఁ
బలికిరి పెక్కుదీవనల◆వారిగ మాదగు భాగ్యమెట్టిదో 5

ఉ. ఎన్నఁగ నాంధ్రజాతి కళ◆లింపగు శాలకు రాచకర్ణమం
దున్నతినున్నవారలును◆నొప్పగ విద్యల వన్నెవాసియుం
గన్నబుధుల్ స్వకీయమగు◆కార్యపుతొందర లాపివచ్చి మా
పున్నెమదేమొ దీవనలు◆పొల్పుగఁజేసి రనుగ్రహంబునన్ 6

సీ. బంధువర్గంబులు◆ప్రతిఘామశకటముల్
నిండుచుఁ దండోప◆తండములుగ
వచ్చి పెండిలికన్న◆వైభవముండునే
యనుమాటకిది నిద◆ర్శనముగాఁగ
నప్పారి మేటిదై◆యొప్పు పంతులవారి
సౌధంబు చాలక◆సరసగల్గు
బంధుమిత్రుల యిండ్ల◆బసలుచేసి వివాహ
విభవంబులెన్నుచు◆వివిధగతుల

గీ. తమ్మలమ్ములవేయుచుఁ◆దరుచుగాను
మమ్ముఁగా పీలకునుబిల్వ◆మరచిరనుచు
బిగువుఁజూపెడువారును◆బిల్వనేల
మనకులేదొకో స్వాతంత్ర్య◆మనెడువారు 7

సీ. నవనారదుఁడనవీ◆ణాగాన మొనరించు
సంగమేశ్వరశాస్త్రి◆సభను వెలయ
నపరకృష్ణుఁడనంగ◆నలరు సంజీవరా
యుశువేణుగానంబు◆నుల్లసింప
గానంబునకు మహా◆గంధర్వుఁడన ఫిడేల్
పట్టి కోటయ్య దే◆వరయుఁ బాడ
కఠినశిలావళుల్◆గరగంగ నాగర
త్నముహృద్యగాత్రగా◆నంబుసల్ప

గీ. గలుగుసభికులు వ్రాఁతబొ◆మ్మలవితాన
జేయికదపరు కనుఱెప్ప◆మూయుబోరు
బాపురే యాసభాస్థలి◆వైభవంబు
ఇంద్రసభతోడఁదులతూఁగు◆నించుమించు 8

సీ. మేళంబు సాగింప◆రేలవచ్చితిరని
వేశ్యలపైఁ బెక్కు◆విసుకువారు
లేనిపెత్తనములు◆బూని యుత్సవమున
కాలస్యమాయె లెం◆డనెశువారు
అత్తరుపన్నీరు◆లగరు గంధమ్ములు
నలఁదిహోషులు పెక్కు◆సలుపువారు
తలమువ్వీము స్త్రీబు◆నిలుపు ప్రక్షుబిడ్డల
కంచు లెంకల నద◆లించువారు

గీ. కన్నెగలవారలెంతజా◆గ్రత్తనున్న
దెప్పరంబుగ లోటెంచి◆దెప్పువారు
నహహ తిండికిలేటాయె◆ననెడువారు
నైరపుశువారువీరన◆నలవిగాక 9

సీ. పెక్కుచంద్రులుగల్గి♦రొక్కుమ్మడినటంచు
గ్యాసులైటులగల♦వాసిఁబొగడి
వివిధవర్ణంబుల♦వెలయురిక్కలఁ గాంచుఁ
దారభాణంబుల♦సౌరులెంచి
యచ్చరలవనికి♦వచ్చిరంచునటించు
నాగవాసంబువ♦ర్ణనముఁజేసి
పువ్వులుపండ్లొప్పు♦భూరుహంబులసిరిఁ
బూనెనంచును జిచ్చు♦బుడ్లమెచ్చి

గీ. యిన్నిటికి నబ్బురంబేల♦యిట్లుమచ్చు
మలములేనట్టిజోడెందుఁ♦గలదటంచు
నవ్వధూవరులనుగాంచి♦యబ్బురంబు
నొందిరెల్లరు నూరేగు♦నుత్సవమున 10

ఉ. ఈడునుజోడు మేనఁగల♦యింపునుసొంపును మేటివంశపుం
బాడియునొక్కరీతిఁదగె♦బాపురెయయ్యదియుండఁ బేరులుం
గూడుకయొక్కటయ్యె నిటు♦కోరికదీర్పఁగ నివ్వధూవరుల్
పోడిమి నెమ్మదుల్ గలసి♦పొల్చెదరంచు వచించిరెల్లరున్ 11

సీ. ఒకవంక నైరావ♦తోపమానంబులౌ
సమలంకృతమదేభ♦సముదయంబు
నొకవంకనూర్వ్యాశ్వ♦నికురుంబమును గెల్చు
నసమానజవనవా♦హనచయంబు
నొకవంక లోకుల♦కుల్లాసమొదవించు
తారాదివహ్ని యం♦త్రములసమితి
నొకవంకదశదిశా♦ప్రకరంబు ప్రయ్యంగ
ధణధణమోయు వా♦ద్యములరవముఁ

గీ. శౌలఁగ నేకీభవించి వచ్చినయనేక
బంధుహితమంత్రిభృత్యాదివర్గములను
మించు గౌరవముల నాదరించిరొకఁ-
పాటివారలె వల్లమన్నాటివారు 12

క. వేయినుడులేలచెప్పఁగ
నాయోషికయానయమ్ము నావినయంబా
న్యాయంబునెట్టికన్యా
దాయులకుం గనముపొగడఁదగరేవారల్ 13

సీ. సభికులధౌత వస్త్రములపై వేమాఱు
ప్రాయు నత్తరువుల పరిమళంబు
గస్తూరి కాగరుకర్పూర మిళితమౌ
చందనాలేపంపు సౌరభంబు
నతిశీతలత్వపార తతిఁబోలెపైఁజల్లు
పన్నీటఁబొడము సువాసనయును
వేనవేల కొలంది విసుగులేక నొసంగు
విరి గులాబీపూల వెలయువలపు

గీ. సరస తాంబూలవీటికా జనితవివిధ
మధురసౌగంధ్యమును సభా మందిరమ్ము
నుండి గుప్పున దశదిశల్ నిండి వృద్ధ
యోగులకునైన శృంగార మొదవఁజేసె 14

చ. జతలుగగూడి మానవులు చక్కని పెండిలి వైభవంబు జూ
చితిమనువారు నేత్రములు జేసిన పుణ్యఫలంబు నేఁడు గాం
చితిమనువారు నిట్టి యతిచిత్ర వివాహము ధాత్రిలోనహా
ప్రతియనువారునై పురిన పారముదంబును గాంచిరెల్లరున్ 15

ఉ. పండితులం గవీంద్రులన♦వారణఁ జేరిచి యైకమత్య మం
దుండఁగఁ జేయువాంఛమది♦నువ్విళులూరుచునుండ నింతలోఁ
బెండిలిరాఁగ దానికయి♦బిల్చితివారపుడేట నేట ని
ట్లుండిన బాగటన్న నపు♦డొప్పితి నాగతిఁగూర్పు సేయఁగన్ 16

చ. పరిణయమందుఁ గూడుకొని♦పల్కినపండిత వాక్యమేను ని
ర్భరముగ నామనంబున ను♦పశ్రుతిగాఁ దలపోసియెల్ల వ
త్సరముల నీసమాగమము♦సల్పఁగ నెంచియె వ్రాసియుంటి ని
వ్వరుసను మీఁది యంశముల♦వ్రాసితి కౌతుక వృత్తిమీఱఁగన్ 17

ఉ. మంతన మొప్పభాష నభి♦మానముగల్గిన వారుదీనికిన్
సంతసమందిరేనియును♦సాగఁగఁ జేసెద నట్టిభారముం
గొంతవహించెద న్మొదటి♦కూరుపు నెల్లరు నెంచి యొప్పుగా
వింతమటన్న నప్పటికి♦గ్రన్నన సిద్ధముగాఁగ నుండెదన్ 18

మ. తొలుతన్ వాగనుశాసనుండు నిలిపెం♦దోడ్తోడ రాజేంద్రుఁడీ
తెలుఁగున్ వర్ధిలఁజేసెఁ దిక్కనమహా♦ద్వృత్తిం బరంగించెన
వ్వలనెఱ్ఱాప్రగడాఖ్య సత్కవియునొ♦ప్పన్ సోముఁడుం బెంచిరీ
యిలపైదానికిఁ గృష్ణరాయుఁడును జే♦యించెం జయంతింగడున్ 19

క. ఆగుణవంతుఁడుఁ కన్నడ
వేగికళింగాంధ్రచోళ♦పృథివీస్థలులన్
బాగుగఁ దెలుంగు బాసన్
బ్రోగించెం దిక్కులెల్ల♦రొదలాదవంగన్ 20

క. ఏనాటకవిత్రితయము
నూనయశో వైభవమున♦నొప్పెన్ భువిలో
నానాటనాంధ్రభాషా
మానిని బాల్యంబుమీఱి♦మన్ననఁ గాంచెన్ 21

గీ. కావ్యరచనాగరిమఁ జూపెఁ నవ్యరీతి
నాంధ్రకవితాపితామహుఁ డతనిపిదప
ఘనుఁడు పింగళి సూరన కావ్యకాంత
వివిధరీతుల మెప్పొంది వెలయఁజేసె 22

గీ. కవిత, విక్టోరియారాజ్ఞి కాలమందు
మరలఁ దలయెత్తెనటులౌట మాన్యమైన
యామెచరితవసంతసు మాఖ్యనొక్క
కావ్యమొనరించితిని మహాకవులు మెచ్చ 23

ఉ. ఆసతికాలమందుఁ గవి తాంగనయెల్లెడ సంచరించెని
బ్బాసను సత్కవుల్ బలుప్రబంధములన్ రచియించిరెల్లెడన్
వాసిగవిద్యలం గఱచు వారలనేకులు వృద్ధిఁ జెంది రు
ల్లాసముమీఱఁ గావ్యసతి లాస్యముసల్పెను మోదమొప్పఁగన్ 24

క. ఒకచెంతఁ గ్రైస్తవులు వే
ఱొకటఁ గళాశాల లేలుచుండెడువారో
క్కొక్కచొ ముద్రణశాలా
ధికృతుల్ కృతులెల్ల విస్తృతికిఁ దెచ్చిరిలన్ 25

చ. పడమటిఖండమందుఁ గల వర్ణనముల్ మనకావ్యకన్యకం
గడఁగివరించె నెట్టులనఁ గాసులభంబగు శైలియుండినన్
జెడఁగగునంచు నొక్క మిషఁ బెట్టి కవిత్వముగంగఁ బోలికం
బుడమిపయింబడెందుదకు భోగిజగంబున కేగుదెంచునో 26

ఉ. ప్రాసములన్ యతుల్ వలదు పద్యమునందగు నన్యదేశపుం
బాసలు సంకరంబయినఁ బాటియొనర్పమి చిన్నవాక్యముల్
జేసిన మేలటందు రిటు చెప్పుటశబ్దపు కేమిచేతనో
మాసినవల్వఁ దాల్చుగతి మంచిగడించఁగ శక్తిచాలకో 27

సీ. అల్లికజిగిబిగి♦యలసానివానితో
నలసంగ్రహము తిక్క♦యజ్వతోడ
ముక్కుతిమ్మనతోడ♦ముద్దుపలుకులు
వ్యాకృతి చిన్నసూ♦ర్యాఖ్యుతోడ
ననఘపింగళిసూర♦నాఖ్యుతో నౌచితి
సరసత రామభూ♦షణునితోడ
భవ్యవాగ్గతిరామ♦భద్రునితోడను
దక్కువారలతోడఁ♦దక్కునవియు

గీ. ననిచిశృంగారరసమసా♦ధ్యంబుగాన
కరముగనొసంగి సంఘసం♦స్కారులకును
మిగిలిరిప్పటికవివరుల్♦మేలుమేలు
నవరసములిందు నష్టతఁ♦దవులుకొనియె 28

క. శృంగారము నింద్యంబని
పొంగుదురది గాదుగ్రామ్య♦పుంబలుకులతో
డంగూర్పరాదుగాకమ
హింగలవేయాదిరసము♦సెనయని కృతులున్ 29

ఉ. భారతమందునొప్పు మఱి♦భాగవతంబునఁ జెప్పనేల శృం
గారముస్తోత్ర పాఠములఁ♦గల్గునువేదపు మంత్రరాశిలో
నారయవచ్చుబైబిలున♦నంటెను సాలొము మాటయేల శృం
గారముబారదోలనిలఁ♦గావ్యము లెల్లను సున్నసున్నయౌ 30

గీ. హంసవింశతి శృంగార♦మతిశయిల్ల
నది యొకనిఘంటువునుబోలి♦యాంధ్రభాష
కాదరువుఁజూపు నియ్యది♦యణఁగెనేనిఁ
బాసయింతికి నొకకాలు♦భగ్నమగుట 31

ఆ. ఆంధ్రదేశ సతుల♦యరగప్పు రవికలు
హూణసతుల వీడు♦చుండురవిక
లుండుఁగాక చదువు♦చుండెడువారికిఁ
గన్నుమూసి గంతఁ♦గట్టుదమిఁక 32

ఆ. రసికజనమనోభి♦రంజనంబాదిగా
నాదిరసముగల్గు♦నట్టికృతులు
దేశముద్ధరింప♦దివిరిన పెద్దల
కృతులుగాన నందుఁ♦గీడు లేదు 33

క. హాలికులు మున్నగు వారలు
పొలములభాషించు పచ్చి♦బూతులు మరికో
ట్టులవాగ్జాలంబులలోఁ
బలికెడు దుర్వాక్యములను♦బాటియె రచనల్ 34

క. కచముల కుచముల పేరులు
వచియింపక మనసు చెదర♦బహుశృంగార
ప్రచురముగఁ గవితనల్లిన
నుచితమె యిదానిఁగనియూర♦కుందురదేమో 35

ఉ. నాకుజ ముఖ్యులౌ కవు ల♦నంతములౌ కృతులన్ రచించి సు
శ్లోకుల సచ్చరిత్రములు♦సొంపుగనిల్పిరి వారు వోయినన్
లోకములందదక్షరము♦లుండుఁగృతికర్తల పేళ్ళు నిశ్చలా
నేకరణిం గణింపనగు♦హృద్యములై తగు తచ్చరిత్రముల్ 36

ఉ. ఈగతినిల్పి వారి కృతు♦లెన్నికఁ గాంచుచు దేశసుస్థితిన్
నాగరికత్వమున్నతి ఘ♦నత్వము దెల్పుచు హిందుదేశమో
హోగురుశుద్ధ సచ్చరిత♦నొప్పువె బాపురె యంచు నెల్లరున్
బాగుగ సన్నుతించుటకుఁ♦బాత్రముగా నొనరించెనద్దిరా 37

ఆ. కవులనంగ సృష్టి♦కర్తలు కాలత్ర
యజ్ఞులిట్టులయ్యు♦నాంధ్రభాష
పాలుపుదకు—మారి♦పోవుచునుండంగ
నేమి సేయుచుండి♦రెట్టితగవు 38

చ. కవులొనరింపఁగాఁ దగిన♦కార్యములన్ విడనాడివాక్యపుం
గవరము జేయుచొండొరుల♦పైఁ బఱుచుందురు లాభమేమియో
వివరముసేయ రత్నకవి♦వేదము వేంకటరాయ శాస్త్రియుం
దవిలి పెద్దకయ్యమున♦దానఁబడెంగవిసంఘ మకుటా! 39

క. మిపులఁగ వేంకటరత్నము
కవియును వీరేశలింగ♦కవియునుబోరం
దవిలిరొకప్పుడు దానం
బావడికయొకుంతయైనఁ♦బొందిరె పుడమిన్ 40

సీ. తిరుపతివేంకటే♦శ్వరులు గద్వాలాది
దేశములం బోరుఁ♦దెచ్చికొనిరి
అదియుఁజిరంతనం♦బయ్యెఁ ద్రవ్వఁగ నేల
యొకవంక రామకృ♦ష్ణకవియుగము
నొకచెంతఁ గొప్పవ♦రకవి యుగ్మమును
నెదిరించి బవరంబు♦వదలరైరి
వృథ సేయుచుండిరి♦విద్వద్ధి ననర్గళమైన
కవిత నకుటయేమి♦గర్గదాన

గీ. వాసిఁబశ్చిమఖండ ని♦వాసులకును
మనకుఁగల్గినయట్టి స♦మైత్రివలనఁ
దెలియఁబడినట్టినూత్నాంశ♦ములు దెలుఁగున
గ్రంథరచనయొర్పఁగాఁ♦గడగవలయు 41

చ. పరగఁగఁ బాండితి న్నిగులఁ♦బ్రౌఢివహించినవారు దీనికై
చొరవక యాంధ్రభాషనొక♦చొప్పున నారసిహూణభాషలోఁ
బరిచితిగల్గువారలకుఁ♦బాల్పడఁజేసిరి వారలైననో
భరమయితోఁచుదీనికయి♦పాటువహించుచునుండి రెంతయున్ 42

గీ. యత్నమెంత యొనర్చిన♦నట్టివారు
గ్రంథరచనయొనర్చుటఁ♦గావ్యశబ్ద
గరిమచాలక యదియు నె♦ల్లరకు నర్థ
మింపుగానీయఁజాలక♦యేపడంగు 43

చ. తిరుపతివేంకటేశ్వరులు♦తెల్గునవ్రాసిరి యింగిలీషులోఁ
బరగెడుబుద్ధసచ్చరిత♦పద్యముహృద్యముగాఁగసీగతిన్
వెరవునఁజేయునట్టి కృతి♦వృత్తులు దూరముఁజేసివీరుమా
సరసను గూరుచుండుటకుఁ♦జాలరు మాసరిగాఁ గవిత్వమున్
విరచనఁ జేయఁజాలినను♦వీరలనొప్పెదమంచుఁ గొందఱిం
గురువులటంచు మమ్మనరు♦కూడదటంచు వచింత్రు కొందఱిన్ 44

క. ఇవ్విధమునఁ బలుకుచు బలు
చివ్వకుఁగాల్ ద్రవ్వనగు నె♦చింతింపంగా
నెవ్వరి కెవ్వరు సరిగల
రెవ్వరికెన్వా రేగాక♦యేనాఁడైనన్ 45

ఉ. పద్దుగఁ గృష్ణరాయపతి♦పక్కకియెత్తఁగఁ గూరుచున్న యా
పెద్దన, రామభూషణక♦విక్రియ శ్లేషమొనర్పకుండ బల్
విద్దెకుఁ దక్కువయ్యెను క♦విత్వ పితామహుఁడన్న గొప్పయుం
బద్దనవచ్చునే యొకటఁ♦బ్రౌఢివహింతురు కొందఱెంచఁగన్ 46

సీ. కొప్పవరపువారు♦గూర్తురు గంటలో
ముద్దుగా నేనూరు♦పద్దెములను

తిరుపతివేంకటే♦శ్వరులతో నిరుబాస
సాహిత్యమునఁదూగఁ♦జాలకుండ్రు
సరివివేకానంద♦సన్న్యాసివలెవీరు
సూత్రభాష్యముఁజెప్పఁ♦జొరకయుండ్రు
రైలువేగమున నా♦ర్టనుపల్కఁదగియు వే
తాకరితోఁ గవితయల♦మర్చిగాఁను

ఆ. వీరికున్నవిద్య♦వారికిలేకునిఁ
హెచ్చుతగ్గులెన్న♦నెవరివశము
గానవీరివాద♦కలననిర్ఘము
హాసభాజనంబు♦నగుచునుండు 47

చ. పరపరవస్తురంగకృతి♦వర్యుఁడు పండితవేంకటార్యుఁడుం
దిరుపతివేంకటేశులను♦ధీరతఁబూనిశతావధానముల్
జరిపెడునాఁడు డీకొనఁద♦లంపరు వారలపైకి శిష్యులం
బురికొలుపందలంపరిటు♦బుద్ధులు లేవొకొ వైష్ణవాళికిన్ 48

ఆ. కొప్పరపువారి♦గుంటూరువారలు
బిరుదులిచ్చిచాల♦బెద్దఁజేసి
రప్పుడెల్ల నీశ♦తావధానులుగల
రంచువారిమదుల♦నెంచలేదొ 49

సీ. అష్టావధానంబు♦నాచరించితినేను
సంస్కృతంబునుగొంతఁ♦జదివియుంటి
నాటకంబులు, వచ♦నములు, ప్రబంధముల్,
నవలలుమున్నగా♦వివిధకావ్య
విరచనఁజేసితి♦నిరుపమానంబగు
కవితారసాస్వాద♦కలనఁగంటి




గ్రంథంబులును పెక్కు ♦ గాంచితిఁ బండిత
కవులతోఁ బలుమరు ♦ గలియుచుంటిఁ

గీ. గాని యీ గతి వాదముల్ ♦ గాననైతి
విబుధవరులార నాదొక్క ♦ విన్నపంబు
ఇచ్చదీరంగఁ బోరుల ♦ గ్రచ్చుకొన్నఁడు
దానిఫల మెద్దియో దయఁ ♦ బూని చెపుడు 50

సీ. వైదికనియోగిభేదము ♦ ల్పాదుకొలిపి
వాదు సేయుదురది పిచ్చి ♦ వాదుగాదె
యదిమదిని నిల్పి గుంటూరు ♦ నందువార
లిట్టివాదములకుఁ గడ ♦ గట్టికొనిరి 51

గీ. ఒక్క కాలంబునందు స ♦ హోబలుండు
వైదికుండని బ్రమసి సం ♦ పన్నుఁ డొకఁడు
పాగడైనంత నియోగిగా ♦ నెగడెనంచు
నొక్కఁడిచ్చి నిదర్శనము జూపె ♦ జక్కఁగాను 52

ఆ. తల. పనీశతావ ♦ ధానులకీ భేద
మించుకైన లేదు ♦ కృతులు వార
లొసఁగ రెన్నియోని ♦ యోగులకటుగాన
భేదమనుచు నిపుడు ♦ పెట్టనేల 53

ఉ. వైదికులున్నియోగులును ♦ వారలవారలలోన నాడికా
పాదితభిన్నతం దగిలి ♦ బాంధవమందును వారువీరలన్
భేదముగల్గి భోజనవి ♦ భేదములేక చరించిరిప్పుడీ
వాదములేల వారలకు ♦ వారును వీరికి వీరు సాటియా 54

ఉ. జాతినిఁ బట్టి సత్కవిత ♦ చాతురి హెచ్చును దగ్గఁ జెందునే
ఖ్యాతుఁడు చేమకూరకవి ♦ కల్గఁడె వేశ్యకు నిట్టులుండఁగా

నేతరిన్ విభేదమును♦నించుక జెందిన యట్టివైదిక
వ్రాతమునున్నియోగి జన♦వర్గము సాహితి వేఱు జెందునే 55

ఆ. వేదవిహితకార్య♦వృత్తులనుంచుట
వైదికులును లౌక♦వర్తనముల
నియతులై నియోగు♦లయిరిగా కొక జాతి
భేద మెట్టి శాస్త్ర♦వేత్త బలుకు 56

ఉ. వైదికులందు లౌకికులు♦పండితులుం గవులుండ్రు వేద వి
ద్యాదరముం గవిత్వమును♦నచ్చపు బాండితి యున్నియోగులం
బాదుకొనుండ లంపఁగ♦వివాదపడందగు హేతువింతయున్
లేదుగ దావివాద కథ♦లీనము జేసి సుఖింపుఁడేకమై 57

ఆ. ఎల్ల బ్రాహ్మణులును♦నేకమై యుండంగ
యత్న మాచరించు♦టర్హమగును
వేరువేరు శాఖ♦లేరి యెక్కువ సేయఁ
బాడిగాదు సౌఖ్య♦పదము గాదు 58

ఉ. వావిరి సత్కవీంద్రులన♦వద్యగతిన్ రచియించినట్టియా
దీవన పద్దెముల్ వరుస♦దీర్చి నే బ్రచురించుచుంటి స
ద్భావుకముల్ వసూవసుల♦పారము లెంగొన దీవనిచ్చుచున్
దేవము సంస్కరించుచును♦దద్దయు నేవిరమింతు నింతటన్ 59

ఉ. ఓకవులార పద్యముల♦నొప్పుగ వ్రాసెడు నట్టిరీతిలోఁ
గై కొనఁజాలదు ముందు వెను♦కల్, మునుమున్నుగ నెల్ల పద్యముల్
మే కొని విన్యసింపఁదర♦మేయటు గావునఁ గోపమూనఁగాఁ
బోకుఁడు తుల్యభావమును♦బొందుటకుం దగ మిమ్ము వేడెదన్. 60

ఇట్లు సజ్జనవిధేయుఁడు,

రాజా భుజంగరావు.

శ్రీ

# మార్కండేయ స్వామినేనమః.

శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దరు జమీందారుని

# వివాహ మహోత్సవాశీర్వచన పద్యరత్నావళి.



## మ॥ వద్దాది సుబ్బారాయుడుగారు.

సీ. శ్రీ మందరాద్రి మంథామథ్య మానాబ్ధి
రవళి మంగళతూర్య రవము గాఁగ
సద్యస్సముత్పన్న సకల కలాస్పదా
ప్సరసలు నాగవాసములు గాఁగ
నజరామరత్వ భేషజ సుధాదరబుధా
వళి సభాసద విప్ర కులముగాఁగ
బాలభానుప్రభా భవ్య కౌస్తుభమణి
దానసాద్గుణ్యార్థ దక్షిణయుఁగ
గీ. శీర్ష సంకీర్ణ విగళిత క్షీరబిందు
పటలి తెలి ముత్తెముల తలంబ్రాలుగాఁగ
వెలయు నాదిలక్ష్మీ మహావిష్ణుదివ్య
పరిణయము పోల్చు నీ వధూ వరుల సిరుల. 1

ఆ. విశ్వసుందరునకు వెలఁదిఁగావించి యీ
త్రిపురసుందరిని విరించనుండు
వాడరేవునకును వర్ణమన్నాటికి
బాంధవంబుసహజ భంగిఁగూర్చె. 2

సీ. ప్రభవించె బహు తులాభారముల్ దూఁగిన
కొచ్చెర్లకోట సత్కులమునందు
లక్ష్మీసరస్వతీ లాస్యరంగంబగు
వాడరేవు మహాన్వవాయమునకు
రత్నదీపము సుందరప్రభు వరియించె
గనె మంజుమణి పుత్రికాత్రయంబు
తత్తదపత్య తత్సంతాన మూలంబు
ననేక దేశ బాంధవము గాంచె
గీ. నాత్మ దత్తపుత్రుఁడైన దౌహిత్రుని
పరిణయంబుజరుప బంధురునకు
గజభటాశ్వ బంధుకలితయై వచ్చిన
ప్రథితగుణకదంబ రంగమాంబ. 3

## పాటక చేరీల పద్యములు.

ఆ. వెదురుఁగోవి లేదె! మృదులాంగుళులు లేవె?
మాకు లేదె వదన మారుతంబు?
జనులకర్ణములను సంజీవరాయని
యట్టులిడవు గాక యమృతరసము. 1
ఆ. మూర్ఛపుచ్చుఁ బ్రాణములఁదేర్చు నహహ యీ
నాగరత్నమింతి నామమునకు
సూరిజనులు విశ్వసుందర పరిణయ-
హాతులరవి యర్థ యుగము చెప్పుఁడ. 2
కం. మూయించును గనురెప్పల
హాయియనం జేయునోళ్ళ నట్టిటులాఁచున్
మా యాదలలను మేనులఁ
గాయక కోటయపిడేలు కాళలిదహహా. 3

క. పదభూషణ సహితము కా
రద నీసభ విశ్వసుందరా! నటియించెన్
గదరాసంగన తుంబురు
మృదువీణాకలనినాద మిషమునసాగియన్. 4

## ఊరేగింపు పద్యము.

చ. అసదులఱలాతి వెల్గులని యాగ్రహతారలఁ దెచ్చి క్రిందికా
కసమున వానికిన్ బదులుగాఁ బెఱజ్యోతులఁబంపినట్లుగా
నసదృశ శుభదీప్తిగల యావిరిదివ్వెలు గాలిలోన న
లైసఁజను దివ్వెబుట్టలు వెలిఁగెడు సుందరు నేగు పెండిలిన్.



## మ॥ పోతుకూచి చంద్రయ్యశాస్త్రి గారు

శ్లో. శ్రీవైవాహికవేదికోపరి సువర్ణాకీర్ణ పీఠస్థితా
గౌరీదక్షిణదృఙ్నిరీక్షితశివా మందస్మితాలోచయ
తేఽనాయంకుటికారమిందు సదృశం వోఢుంధృఢంమస్తకే
నిర్ణీతఃకిమితీతి యానగసుతా సావిశ్వకల్యాణదా. 1

శ్లో. రాజా బాహదరాదిశస్త బిరుదం శ్రీరాజ రాజోత్తమం
వాడేవ్రాన్వయ వారిధీందు సదృశం కళ్యాణ కల్యాకరం
బాలాత్రైపురసుందరీ యుతమిమం దీర్ఘాయుషం శ్రీజుషం
ధీనిధ్యుత్తమ విశ్వసుందరవిభుం పాయాత్సదాసర్వధా. 2

## మ॥ శ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావు పంతులుగారు.

గీ. విశ్వసుందరమూర్తి యీ పెండ్లికొడుకు
త్రిపురసుందరీదేవి యీచపలనయన
సుందరునిబొందె నిప్పుడీ సుందరాంగి
ఆత్మ పరమాత్మతో నైక్యమందు నట్లు. 1

సీ. స్తవనీయ కుసుమపల్లవ జాలశుభ నికుం
జములెల్ల మణితోరణములు గాఁగ
బహువర్ణ పుష్పశాద్వల మనోహరపఙ్క్తు-
లలరారు రత్న కంబళులుగాఁగ
పరిపక్వ పనస జంబురసాల మధుపూర్ణ
సత్ఫలంబులు సుభోజ్యములుగాఁగ
గీ. శుభ్ర నీలాభ్రముననొప్పు చుక్కలెల్ల
చాందినుల పారదపుబుడ్ల సమితిగాఁగ
మహితలంబను కల్యాణ మంటపమున
మానవాత్మవరించు బ్రహ్మాండభర్త
సకలసంపద లొసఁగు నీ జంపతులకు. 2

చ. నరపతులెందరోకలర నంతమహామహిమాభిరాములై
ధర గవినాథులుంగలరు దారయశోవిభవాభిరాములై
నరపతియై కవీంద్రుఁడయి నాఁడొకకృష్ణవిభుండె ప్రొల్చెనా
సరణిని నీవు నొప్పెదు భుజంగనృపాల కవీంద్రచంద్రమా. 3



## షడ్దర్శనీపతి, చింతామణికవి, నారాయణస్వామిగారు.

శ్లో. శ్రేయో భూయో భూయో
భూయోభూయాచ్ఛ్రరంగ నాయకమమహేః
తనయస్య విశ్వసుందర
రాజశ్రీ త్రిపురసుందరీ సహితస్య.
సీ. అరివర్గకీలకుండగుటను, ఫల్గుణ
విఖ్యాతిమైనిత్య విజయుఁడగుట
పరిశుద్ధచిత్తుఁడై పరగుట, ధార్మిక
పఙ్క్తికాగ్రసరత్వ పదవిఁగనుట

బుధవర్గమునకెల్ల బోషకుండగుటను
దస్రోపమాన సౌన్దర్యుఁడగుట
ధరమర్త్యఁడర్థిత ధనదుఁడీతఁడుగాన
మకరాకరవిశేష మహితుఁడగుట

గీ. రాజశుభవిశ్వసుందర రాయుఁగూర్చి
తెలుపుఁగీలక ఫాల్గున కలితశుద్ధ
పంచమీసౌమ్యవాసర భవ్యదస్ర
ఋక్షమకరోదయమునన్దు నెసఁగు బెండ్లి. 1

సీ. స్నాతక వ్రతనిష్ఠ జరిగిన తరువాత
వారముఖ్యుల మేజువాణి పాట
వైవాహిక మహోత్సవంబైన యత్తరిగా
నంబు సద్వేణుగా నంబుడంబు
తౌర్యత్రికపు వినోదము నాగరత్న స
మానహీనానూన గానమాన
మభ్యుదయ ప్రదమైన సదస్యంబు
చర్తత స్త్రీయుస్త్రీ సరసగాన

గీ. ముభయ కవివర పండిత సభయుమఱియు
సంగమేశ్వర వైణికోత్తుజ్గగాన
మిట్లు వాడేవు రంగనాథేంద్ర తనయ
విశ్వసుందరరాయని పెండ్లిరొప్పె. 2

ఉ. ఎందుఁగనుం గొనంగఁ గవి బృంద మమంద మరంద కందళీ
తుందము ముందుగాఁ గయితఁ గల్పనఁ జేయఁగ వందలెందు మే
ల్బందమునొంది పాడఁగను సందడి డెందము నందుఁ బొందుచున్
సుందరు లందునందు సొగసుందనపుందమలీల నందగా
బందరు, విశ్వసుందరు వివాహముచందగె నంద మొందుచున్. 3

ఉ. కన్నియవన్నియన్, జనని గాఢధనంబును, దండ్రి విశ్రుతా
త్యున్నతవిద్య, బంధుజన ముజ్జ్వలవంశముఁ, దక్కువారు బ
ల్వన్నెముఁ గోరుచుందురివి యన్నియుఁ గల్గిన విశ్వసుందరుం
జొన్నపుత్రేనిగాఁ ద్రిపుర సుందరిపొందిన చందమందమా. 4

క. వాడేశ్రీపు రంగనాయిక
రాడ్రత్నాకరమువైక రాకారాజ
న్నిడాత్రిజ విశ్వసుందర
రాడ్రమ్య వివాహమహము రాజిల్లుమహిన్. 5

శ్లో. విశ్వసుందర సమాహ్వ యతోఽయం
విశ్వసుందర వివాహ వినోదః
విశ్వసుందర మహా మహశోభా
విశ్వసుందర తయాద్య విరేజే.



## మ॥ దామరాజు శోభనాచలముగారు.

మ. సతతైశ్వర్య సుఖాయురర్థ చయముల్ సంతోషియైయాయుమా
పతినిచ్చుల్ దయచేసి కీర్తి యిడి శుంభద్దాశ్రిజ్య లక్ష్మి సమ
న్వితులౌచు న్సతతంబు పారిభవమునన్ వెల్గొందనీమాత్మ దం
పతులం జల్లని చూపులం గనుగొనున్ వాత్సల్యమేపారఁగన్. ౧

గీ. కవులవాక్కులు మహి నమోఘంబులగుట
నజానకుపదేశకంబులై యమరుగాన
వారునిన్ను రసజ్ఞుగాఁ గోరుచుందు
రదియె భవదీయమైన భాగ్యంబుకలిమి. ౨



## మ॥ కొండూరి తిరుమల భావనాచార్యులుగారు.

శా. శ్రీమద్గోప వధూకుచోపరిమిళ త్శ్రీగంధపంకోల్ల స
ద్భూభామ శ్రీయుత కౌస్తుభాద్యఖిల సద్భూషాంచితోరస్కసు
శ్యామాగాంబుద విద్యుదచ్ఛకనక స్ఫారాంశు కాబ్జారి మ
ద్వామాసవ్యకరాభిరామ హరి యీ వామన్ పతిన్ బ్రోవుతన్.

---

## మ॥ కొంఠి భద్రాద్రిరామశాస్త్రిగారు.

శ్లో. శ్రీసతీ హృదయరంజనాదరః
కామితేష్టఫలవర్షుకో హరిః
విశ్వసుందరసమాహ్వయంవరం
పాలయే త్రిపురసుందరీం వధూం. 1

ఉ. భాసురవాత్సరేవు కులపావన సద్గుణ రంగనాయికాం
బాసుత విశ్వసుందర సమాఖ్యవిభుం డెలనాగబంతికిన్
మాసకమాసతిం ద్రిపురసుందరిఁ గేల గ్రహించె భూసురా
శాసన మంగళంబులకు సత్యముగా నిది మేరయాననన్. 2

క. పతి విశ్వసుందరుండఁట
సతియుఁ ద్రిపుర సుందరియఁట సరి సుందరులన్
జతఁగూర్చిన చతురానను
చతురత మేలయ్యెసృష్టి సంఘటనములన్. 3

ఉ. సుందరులన్న నామములె చొప్పడునంచును నేతిబీరకా
యం దలపోయఁగాదిట హిమాంశుఁడు మున్నగు వారిపోల్కగా
నందముఁ జేరులాకకె సరియైనపడంతియుఁ బూరుషుండు నిం
పొందఁగ జోడు గూడిరిటు లుండవలెన్ రుచిరార్థయోగముల్. 4

చ. ఇతరుల వేరువేరుగతి నెన్నఁగ నేటికి సర్వదేవతా
త్మతఁదనరారుచుండెడి యుదారమతుల్ కవివర్యులార! పం
డితవరులార! నామనవి నిశ్చలచిత్తతఁ జిత్తగించి దం
పతులకనూనరాగమును భాగ్యమునాయు వనుగ్రహింపుడీ. 5

శ్లో. స్వచ్ఛస్వాంజలి సంపుటోద్ధృత లసన్ముక్తామణీసంసర
జ్జ్యోత్స్నాభాసుర మందహాసరుచిర స్మేరానన నాంభోరుహా
సీతారాఘవ వంశమౌక్తికమణీ పాణిగ్రహోరూత్సవే
తచ్ఛోభాంచిత విశ్వసుందరవిభుం పాతాం వధూసంయుతం. 6

మ. వరకీర్తి ప్రథితప్రభావ విలసద్వాడేవిప్రు సద్వంశ భా
సురయైయొప్పెడు రంగనాయకమకున్ నూనుండుశ్రీవిశ్వసుం
దరరాయ ప్రభుపాణి సంగ్రహ మహోదారోత్సవంబెచ్చి బం
దరు సత్పట్టణ మానవావళికి నానందప్రదం బైతగెన్. 7



## మః॥ తిరుపతి వేంకటేశ్వరులశిష్యులు.

శ్లో. శ్రీమన్నిలగళోవిరూపవదన ప్రకాశింత నాగాజిన
స్త్వంగత్తుంగవియన్నదీప్రచలిత శ్రీవామదేవాభిదాం
సాక్షాత్సార్థయితుంమహీతల ఇవ శ్రీవిశ్వలావణ్యకః
బాలాత్రైపురసుందరీ సహభర స్సంజాత ఇత్యర్థయే. 1

శ్లో. శ్రీబాలికా త్రిపురయా సహసక్తచిత్తః
శ్రీవిశ్వసుందరవిభుః పరిపాతునిత్యమ్
శ్రీబాలికా త్రిపురయా సహసక్తచిత్తం
శ్రీవిశ్వసుందరవిభు ప్రవరం సమోదం. 2

## కొత్తపల్లి సూర్యరావుగారు.

మ. రతిరాజ ప్రతిమానతేజులు శచీంద్రప్రోజ్జ్వల ప్రాభవ
ల్వితతైశ్వర్యయశోవిలాసులు లసత్ప్రేమాధుర్యలీనాత్మ దం
పతులాయాదిమదంపతుల్బలెఁగను న్భాసిల్లి నెల్లప్పుడు
న్శతమానం భవతీతి వాగ్గతిసద స్యశ్రేణిదీవించుతన్. 1

మ. త్రిజగన్మాన్య కవీంద్ర పండితవరాధిష్ఠానమచ్ఛాప్త బం
ధుజనాపూర్ణము భారతీవిలస నోద్యోగంబునై మించు నీ
భుజగాధీశ్వర కల్పితార్య సభ సంపూర్ణాయురారోగ్యముల్
విజయంబిచ్చుత విశ్వసుందర లసద్విఖ్యాతభూనేతకున్. 2

గీ. దాతతోఁ గీర్తి యట్లు చంద్రమునితోడ
వెన్నెలయుఁ బూవుతోడఁ దావియునుమాడ్కి—
వెలయుతఁ ద్రిపురసుందరి విశ్వసుంద
రప్రభుని కేలువట్టి నిరంతరంబు. 3

---

## మా॥ కొత్తపల్లి సుందరరామయ్యగారు.

మ. కవిసంఘంబున కేగుదెండనుచు లేఖంబంప నాడే మహా
కవి రత్నంబులు నూత్నదంపతులు దీర్ఘప్రాభవోపేతులై
తవరాజిల్లు తమంచు దీవనలు మోదస్వాంతులై సేసిరా
రవివాహోత్సవవేళ సేయుటది యత్రంబేకవీంద్రాళికిన్. 1

శా. గౌరీనాథుఁడు నిందిరా రమణుఁడున్ క్ష్మాపుత్త్రికానేతభా
షారామావరుఁడు న్వధూవరుల కైశ్వర్యంబుల న్భాగ్యభో
గ్యారోగ్యాయువుల న్సమత్వమున బూర్ణానందులై యిచ్చి వి
స్తారఖ్యాతి నొసంగి ప్రోచెదరుగాతన్ దంపతీయుక్తులై. 2

సీ. నీదానమహిమంబు నెగడిసున్నములోని
కెముక లేకుండ దంచె మహినొకని
నీవాగ్విశేషంబు నెగడియొక్కరునిఁ దోఁక
మడతవేయించివే మడియఁగొట్టె
నీ సత్యసంధత నెగడి నానా మాల
కూళ్ళఁ దిన్పించె నెక్కువగ నొకని
నీపాలనోన్నతి నెగడితా ముప్పాతి
ప్పలఁబెట్టి మూఁడు చెరువ్వలజలంబు
గీ. త్రాగఁగాఁజేసె మేల్బళీ! చాగురే! వ
హవ్వయని కవిజనంబు లహర్నిశములు
దనరనుతిసేయ విశ్వసుందర విభుండు
త్రిపురసుందరిఁ జేపట్టి తేజరిల్లు. ౩
సీ. బిచ్చగాడనక నన్నిచ్చె శంకరునకు
మామతండ్రి యతనిది రాతిగుండె
నీలాంగుఁడనక నెన్నిక నన్నొసఁగెఁ జక్ర
పాణికి మామతండ్రి భంగకాడు
కానవర్తి నాకయొసంగె నన్నుఁ రా
మునకు నాధృతిమునిముచ్చుతండ్రి
చోరుఁడు నాకయుత్సుకత నన్నిచ్చెఁ గృ
ష్ణునకు మాజనకుండు వనచరుండు
గీ. త్రిపురసుందరి పుణ్యంబుఁ జెల్పవశమె
యలదుగౌరియు, లక్ష్మియు, నవనిసుతయు
జాంబవతియును మెచ్చంగ సకలభాగ్య
రూపవర్తన సుచరిత్రి భూపుఁజెంతె. ౪
సీ. సుందరేశవిభుని శుభచరిత్రము ధాత్రి
నాచంద్రతారకం బగుట కొఱకు

నిఁక రంగనాయికాంబిక ప్రజావాత్సల్య
మంతయును విదిత మగుటకొఱకు
మఱినారసింహ సమ్మానంబు బంధువ
ర్గమునకుఁ దేటతెల్లమగు కొఱకు
భళి ! రామరాయని బహుజన మిత్రత
యవనివిశ్రుతమయి యలరుకొఱకు
గీ. కవులు హితులును బంధువర్గంబు భటులు
వేడుకపడంగ నెంతయు విభవమునను
విశ్వసుందర బహదూరు వెలయఁ ద్రిపుర
సుందరిం బెండ్లియైకీర్తి నందెమిగుల. 5

గీ. పలుకుకొమ్మ మగండును బలుకుకొమ్మే
పసిఁడికొమ్మ మగండును బసిఁడికొమ్మ
గట్టుపట్టి మగండును గట్టుపట్టి
యరసిపోల్తురు గాకయీ యాలుమగల. 6

గీ. అన్నయున్ దల్లి లేరను నట్టిలోటు
పెండ్లికొమరునకును మఱి పెండ్లికొడుకు
తండ్రికిని లేక యుండఁగఁ దగ జరిపిరి
నరపతిభుజంగకవి రంగ నాయకమ్మ. 7



## మా॥ సత్యవ్రోలు సోమసుందరకవిగారు.

సీ. ఏదంపతులు సదా మోదంబు గైకొని
జంటబాయక ప్రేమ నంటియుంద్రు
ఏదంపతులు దామె యెల్లలోకములకు
తల్లియుఁ దండ్రియై తనరుచుంద్రు
ఏదంపతులు శ్రీదుఁ డెలమిని చెలిగాఁగ

నైశ్వర్య యుక్తులై యలరుచుండ్రు
ఏదంపతులు శక్తి నెనయు కుమారుని
కొమరునిగాఁగని కులుకుచుండ్రు

గీ. రతిమ సదాశివులట్టి పురాణ దంప
తులు నిరంతర మీదంపతులకు సిరులు
వెలయఁగా నాయురారోగ్య విభవములుస
మున్నతులొసంగి కృపఁబోచు చుండ్రుగాత. 1

సీ. పట్టాభిషిక్తులై ప్రాభవమొందుసీ
తారామచంద్రు లుదారతయును
రజతాద్రివాసులై రంజిల్లుపార్వతీ
పరమేశ్వరులు స్వదైశ్వర్యములును
సర్వవిద్యాజాల సహితులౌభారతీ
చతురాననులు వాక్య చతురతయును
నమరావతీపురి నమరనేలెడు శచీ
వాసవుల్ బహు భోగ భాగ్యములును

గీ. చాలనిడుచు నితోధిక శ్రీలెసంగ
సతతమనురాగ సహిత సంగతులువెలయ
పావనాత్మకు లౌనీ వధూవరులను
బోచుచుందురు గావుత బూర్ణకృపను. 2

శా. జ్ఞానానందరసానుభావులయి సుజ్ఞానాంతరంగోల్ల స
న్మానిస్వచ్ఛమనోజ్జకర్ణికను సామ్రాజ్యంబు దామొందియున్
నానాలోకము లేలుచున్ సతత మానందంబు గావించు ల
క్ష్మీ నారాయణులీ వధూవరులకున్ శ్రీలిచ్చి రక్షించుతన్. 3



## మ॥ పోతిరెడ్డిపల్లె పురుషోత్తమశాస్త్రిగారు.

శ్లో. దద్యాద్వాంపరమానందః
విశ్వసుందరయోస్సదా
ఆయుర్విత్తంచకీర్తించ
శీలంచాపిచిదాత్మకః.



## మ॥ కోకా శ్రీరామారావుగారు.

చ. అగము గృహంబుగా నహికులాధిపుఁడున్నగగా విసంబు మేఁ
తగనిగమాళి వేది సముదాయముగా జలరాసితూణిగా
ఖగ గమనుండు చండ విశిఖంబుగ శైలతనూజ జాయగా
నెగడుమృడుండు దంపతుల నెమ్మినజస్రము నేలుఁగావుతన్

సీ. శ్రీరమ్యమైసుధీ వారసంసేవ్యమై
వఱలుకీలకనామ వత్సరమున
భాసిల్లుఫాల్గున మాసవళక్షు ప
క్షచతుర్థి సౌమ్యవాసరమునందు
వాడ్రేవు వర్థశార్ఙ్గ వమ్ముగాంకుఁడగు విశ్వ
సుందరరాయ వసుంధరేశుఁ
డల వడ్లమన్నాటి కులవార్ధి శుభాంశుఁ
డగు కుశాలాంబయాహ్వయుని గూఁతుఁ

గీ. బరిణయంబయ్యెఁ ద్రిపురసుందరమ యనెడి
బాలికామణి, సతము దంపతులకతుల
ధనకనక వస్తువాహన తతులనొసఁగి
వనధిజామాత కరుణఁ గాపాడుఁగాత.

సీ. ఒకవంక బాడబ నికురుంబముల మంత్ర
ములు నిర్భరంబుగఁ జెలఁగుచుండ
నొకకేవ నర్తకీ నికరంబులనువొంద
సరవిలాస్యంబులు సలుపుచుండ
నొకచాయగాయకు లోరిమిక గుమిగూడి
ప్రతినాదములెసంగఁ బాడుచుండ
నొకచక్కి బంధు మిత్రోత్కరంబులు కట్న
ములనిచ్చి దీవించి మెలఁగుచుండ

గీ. విశ్వసుందరరాయ పృథ్వీవిభుండు
శుభగుణ కదంబకఁ ద్రిపురసుందరాంబ
సొంపుమీర వరించె నీ దంపతులను
వనధిజామాతకరుణఁ గాపాడుఁగాత. 3

సీ. అల త్రిశంకుతనూజుఁడైన హరిశ్చంద్రుఁ
డా చంద్రమతిఁ బెండ్లి యాడినట్లు
వీరసేన సుతుండు వీరుండు నలుఁడు భీ
మా త్మజమును బెండ్లి యాడినట్లు
దశరథ రాజనందనుఁడగు రఘురాముఁ
డవనీ తనయఁ బెండ్లి యాడినట్లు
పాండుభూపతి కుమారుండర్జునుఁడు సుభ
ద్రాంగనామణిఁ బెండ్లి యాడినట్లు

గీ. విశ్వసుందరరాయ పృథ్వీతలేశ్వ
రుఁడు త్రిపురసుందరాంబ యనెడి కౌతుక
నింపుమీఱ వరించె నీ దంపతులను
వనధిజామాత కరుణఁ గాపాడుఁగాత. 4

సీ. నవబోణి వనరుహాసను రాణియగు వాణి
మెచ్చి మృదూక్తుల నిచ్చుఁగాత
మేల్గానంబులవెల్లి మీనకేతునితల్లి
కరిచ్చుఁగల్మి నందిచ్చుఁగాత
మిహిరసదృశతేజ తుహినశైలతనూజ
చెచ్చెర దీర్ఘాయు విచ్చుఁగాత
వందితామరకోటి వరవాసవునిబోటి
హెచ్చగు వైభవం బిచ్చుఁగాత

గీ. హవ్యవాహన పవమాన యాతుధాన
వారినిధిరాజ పితృరాజ వర ధనదుల
దార లనవరతంబు నీ దంపతులకు
ముదముదవు కొత్త భవుక మిడెదరుగాత. 5

చ. తనరగఁ గృష్ణరాయ వసుధాపతిసన్నిధి నల్లసాని పె
ద్దనముఖ సత్కవీంద్ర సముదాయముపోలిక రాజరాజ భూ
పునిసభనన్నయాది కవిపుంగవులిట్టుల నేఁడు విశ్వసుం
ద్రనృపతి సమ్ముఖానఁ గవిరాజులు మన్ననలందిరియ్యెడన్. 1



## మ॥ కూచి సత్యనారాయణమూర్తిగారు.

ఉ. శ్రీసతి రాజ్యలక్ష్మి సరసీరుహనాభుఁడు పుణ్యకీర్తి ప
ద్మాసనురాణివిద్య కమలాసనుఁడాయువు పార్వతీశ్వరుల్
మైసగమైనదాంపతిక మైత్రియునిచ్చుచు రంగనాయికాం
బాసుతు విశ్వసుందరు నపారకృపారస దృష్టిఁజూచుతన్. 1

సీ. ఒకవంక నిగమంబు లుచ్చరించుచు నవ
బ్రహ్మలోయననొప్పు వైదికులును
ఒకవంకరసకల్ప నోత్పన్నకీర్తులై
సఫలభాషణులైన సత్కవులును
ఒకవంకవస్తు వాదకలా రహస్యముల్
తర్కించు మహనీయో తార్కికులును
ఒకవంక ప్రత్యయ ప్రకృతిరూపకశబ్ద
శాస్త్రసంవాదులౌ శాబ్దికులును
గీ. మొదటఁగల్గిన బుధ సత్తములు వచించు
స్వస్తి మంత్రార్థములు సత్య సరణివెలసి
త్రిపురసుందరి ధర్మ పత్నిగనెసంగు
విశ్వసుందరు వృద్ధి గావించుగాక. ౧
చ. కరమగురూప సంపదను గాకయెపేరున గూడ విశ్వసుం
దరుఁడయి రంగనాయిక యనందగులక్ష్మికిబుత్రిఁడౌటచే
సరసిజనూతిపీని ననుజన్మనికన్నను బ్రేమఁజూచి వి
స్ఫురితకలాఢ్య నీ త్రిపురసుందరిగ్నూర్చి కృతార్థుఁ డయ్యెడిన్. ౨



## మ॥ వెంపటి వెంకటశాస్త్రిగారు.

శ్లో. శ్రీరంగనాయికాంబా స్వీకృతసత్పుత్ర విశ్వసుందర శ్రీమాన్
జీయా త్సహస్రశరద త్సానందఽత్రిపురసుందరీ సహితః. ౧
క. శ్రీరంగనాయికాంబా
కరస్వీకృతపుత్రినిన్ను కవిబుధసుహృదు
ల్తరిమరి దీవన లిత్తురు
సురుచిన్వరియించు త్రిపురసుందరి బాలన్. ౧



## మ॥ నంబూరు తిరునారాయణస్వామిగారు బి.ఏ.

శా. శ్రీకాంతామణి కూర్మి పెంపరియించంగా వె మున్నెన్ని సు
శ్లోకంబైన భవత్కులమ్మును సుధీలోకంబు మన్నించి త
త్సాకల్యాదృతి భారతీ సతి కటాక్షంబందితీ విష్ణు మీ
కాకళ్యాణుల సత్కృపఁగలుగుగా కైశ్వర్య విజ్ఞానముల్. 1

గీ. పుట్టినప్పుడె మీరూపు పోలుపుగాంచి
విశ్వసుందరుఁడను పేరు పెట్టిరార్యు
లమల సద్గుణ వైభవం బడరఁ జూపి
విశ్వసుందరవిఖ్యాతి వెలయ వయ్య. 2

## మ॥ ఆదిభొట్ల నారాయణదాసుగారు.

సీ. పెండ్లిపీటకఁదార్ల వేడుక నొండొరుం
జూచియుఁ జూడని సోయగంబు
మొలకనవ్వులసొగసు ముత్తెములొలుకఁ బూ
జపుబంతిసాగించు జాణరికము
బింబె నీటంగడు సందడిత్రోడనుం
గ్రమలు తడవితీయు గడుసుతనము
పంతమ్మురెట్టింప బలువన్నియలమేను
లలరుచుండగను దండాడు నేర్పు

గీ. చుట్టములకెల్ల ముచ్చట జూరనేయ
కొత్త నేస్తమ్మువిడెము మార్పులనుగట్టి
కొన్న పిన్నయాలి మగళ్ళ గోరెకులచ్చి
వేలుపుల మిన్న నూరేండ్లు పెంచుగాత. 3

ఆ. కులము రూపు వయసు గుణము పేరొకటైగ
గలుగు నీవధూవరులు చిరాయు

వులుగ సుంద్రుగాత భూసురాశీర్వాద
మహిమచేత లోక మాన్యులగుచు. 2

శ్లో. సుందరోజీవతు చిరమ్ బాలాత్రిపురసుందరీ
వరో వధూర్జగన్నాధ కృపయా సర్వధాముదా. 3



## మ॥ కే. వి. శేషాచార్యులుగారు.

క. శ్రీరస్తుజయోస్తులస
ద్దీరస్త్వారోగ్యమస్తు దీర్ఘాయుర్భా
భారోస్తుసంతతేర్వి
స్తారోస్త్వేత స్త్రహేశ దంపతులకిలన్. 1

సీ. జాబాలిగౌతమ జమదగ్ని కౌశిక
కణ్వకాశ్యపకుత్స గార్గ్యపౌండ్ర
రోమశగాలవలోధ్రికవరతంతు
వత్సమంకణ భరద్వాజ కపిల
యాత్రేయ త్రసదస్య యర్చనానసపౌండ్ర
స్యావాస్య పురుకుత్స జామదగ్న్య
మొదలగు ఋషిగోత్రముల నుద్భవించిన
యీసభ్యులగువిప్రు లిపుడిడియెడి

గీ. దీవెనల విశ్వసుందర త్రిపురసుంద
రులకు దీర్ఘాయురైశ్వర్యములును పుత్ర
పౌత్రసామ్రాజ్య విభవముల్ భవ్యకీర్తి
గలిగి సంతోషమున మన గలరు భువిని. 2

సీ. హరిపొత్తు నిరసించి సిరియిట కరుదెంచెఁ
గాకయీ చెలువెట్లు గలుగఁగల్గె

హరు మేనినఱయని గిరిజాత యరుదేర
కీ సర్వ మాంగళ్య మెటులభించె
సరసిజోద్భవునోట నొరపక భారతి
యరుదేర కీ కళ లబ్బెనెట్టు
త్రిపురసుందరులొక్కట రీతిగ నిటురాక
తా బాల త్రిపురసుందరియెటాయె
గీ. అల త్రిమూర్తులు నాండ్రకై యైక్యమొంది
విశ్వసుందరరాయఁడై వెలసెనిట్లు
గాన లక్ష్మీవిభూతి దీర్ఘాయురధిక
సంపదలనీను మనుట నిస్సంశయంబు. 3

ఉ. బాలునిఫాలమున్ జవతిపంమువుచంద్రుఁ డంచు నెంచికా
బోలు ముఖంబువంచె చెలిపొల్పుగఁజూచిన నీ దెయంచతం
డాలలనానతాననమె యాను ద్వితీయ శశాంకుడంచి డెన్
నూలనితోచ్చు నూత్రమొక నూఱు మహాబ్దము లామెకుండుతన్. 4

శా. శ్రీవాడేశ్రీ కులాబ్ధి శీతకరుఁడౌ శ్రీ విశ్వసౌందర్య భూ
దేవోత్తంస శిఖామణిన్ గుణనిధిన్ ధీరాగ్రణిన్ తత్సతిన్
సావిత్రీ ప్రతిమాన మానఘన సత్సౌభాగ్య భాగ్యోత్తమన్
శ్రీవాణీ గిరిజ ల్సిజేశులతుల క్షేమంబులన్ బ్రోచెదర్. 5

చ. స్థిరముగ చంద్రతారలును తీరుగభూమియు జీవరాసులున్
భరమగు పర్వతాళియును భానుఁడుసింధువు గంధ వాహుఁడున్
పరగఁగ కాలమానములు పాటిలు నంతటి కాలమీ వధూ
వరులకుఁగల్గు సంతతులు వర్ధిలుతన్ భువిఁ జిత్త విత్తుగన్. 6

## విద్వత్కవి సభం కూర్చిన
## శ్రీరాజా భుజంగరావుగారి విషయము.

శా. శ్రీ మంత్రి పెగడాబ్ధిసోముఁడు కళా సీమంతినీ లోలుఁడై
సామాద్యుత్తమ గానశాస్త్ర విదుఁడై సర్వజ్ఞ సత్సేవ్యుఁడై

భూమిన్ మోవ భుజంగరాయ విభుఁడై భోగాఢ్యుఁడై సత్కవి
స్తోమంబిట్టిటఁగూర్చు లక్ష్మివర భూధుర్య క్రియా వార్యుఁడై. 7

(కళావిమంతినీలోలత్వ, గానలోలత్వ, సర్వజ్ఞ సేవ్యత్వ, భూవహత్వములు భుజంగరాయనామమునకు సార్థకత్వములని శ్లేష.)

సీ. ఏకళానిధికౌముదీ కుశలతచేత
సకలకువలయ భాస్వరతఁగల్గె
నేలోక బాంధవు నాలోకనంబున
నాంధ్రభాషావని కబ్బెదీప్తి
యేచతురాస్యు భాషాచణ గరిమచే
మంజువాణికిఁగల్గె మహిమభువిని
నేఘను సరసత యిటఁ గూర్చి నిప్పుడు
కవిచాతకంబుల గమినియట్టి

గీ. సరసు శ్రీమంత్రి పెగడ భుజంగరాయు
సరసుఁడా గోపవనితా భుజంగరాయఁ
డెలమి బోరిచెడిగాత నూతేండ్లుమనగ
పుత్రపౌత్రాయురారోగ్య భూతులొసఁగి. 8

(1 చంద్రుడు, విద్యావంతుడు, 2 వెన్నెల, ప్రకాశత, వ్యాకరణ విశేషము, 3 కలవలు, విద్యాప్రపంచము, 4 బ్రహ్మ, చతురభాషి, 5 సరస్వతి, సద్విద్య, ఆపేరి ముదారితురకాల.)

చ. కవికులరంజకుం డఖిలగాఢ తమః పటలప్రహారియా
ర్యవినుతుఁడర్థి సద్విబుధరంజక భూరి వసుప్రదాతయున్
కువలయపాలకుండు రసకోవిదుఁడౌ ద్విజరాజ టంచు శే
శవహరులాత్మ మూర్ధధృత సత్కృతిగాంత్రు భుజంగరాయనిన్. 9

(చంద్ర భుజంగరాయుల కభేదాధ్యవసాయము—హరి మనసుచే, హరుఁడు శిరసుచే, చంద్రుని వహించ హరికి షాన్పును, హరునికి భూషణమును, భుజంగరాయఁడయ్యెను, ధ్వని.)

క. శ్రీ మంత్రిప్రెగడ కులజ
క్ష్మామండలనాథ సరస కవికుల కల్పా
క్షేమంబు మాకు, కృపఁదమ
క్షేమం బెఱిఁగింపగల్గుఁ జేతోముదమున్. 10

చ. కడుఁ గృపతోడఁ దాము కవి గంధగజంబులఁ బెండ్లియందొకే
విడిదికిఁ జేర్ప నెంచి బహు వేడుకఁ గమ్మల నంపువేళలోఁ
దడయక నాకుఁగూడ దయఁ దామిపుడంపిన లేఖఁ జూడఁగా
వెడగు మదిన్ జనించె నెటు వెళ్లఁగఁనౌనట కంచు భీతిచేన్. 11

క. మేలా కవి దంతిఘటా
జాలంబున నన్నుఁ గూర్పఁ జాలుదురె, దయన్
ఆలా ననుఁజేర్పఁగఁ దమ
కేలా యాధోరణేచ్ఛ యిన సమతేజా. 12

గీ. వినఁ దామిటు గౌర వాహ్వానమొసఁగ
నుత్సవాలోకనేచ్ఛచే నుత్సుకతను
బొందియున్ కొంత సంశయం బొందినాఁడ
దానివారింపఁ బ్రార్థింతు ధరణిపాల. 13

సీ. కవివర్యులే తేరఁ గల్గుటకై తాము
నియమించు దినమెద్ది నిశ్చయముగ
తెల్పఁ గోరెదఁ దమ తెల్లనిపత్రిక
యందాదివారంబు పొందుపడియె
వివరణపత్రిక (programme) వేఁజూడ వేఱొక్క
దినమనితోచెడి ఘన యశస్క
చెలగిపరాధీన జీవనులమగాన
రవివాసరమెచాల రమ్యతరము

గీ. అదియొ? వేరొండొ? ప్రతిజాబు నంపఁదగును
శ్రమనొసంగితి నేతమ క్షమకు నిపుడు

పౌత్రుఁడనుజుండి యాత్రేయ గోత్రజుండ
నవనివేంకట శేషాఖ్యుఁ డనెడివాఁడ. 14



## మ॥ అయ్యగారి ఉమ్మన్న శాస్త్రిగారు.

శ్లో॥ రాజేతిబిరుదరాజిత వాడ్రేవుకులీన విశ్వసుందర శ్రీమాన్
జీయాచ్ఛివప్రసాదా చ్ఛ్రీబాలా త్రిపురసుందరీనాథః. 1
శ్లో॥ శైలజామాతరం తుష్ట్యై శైలజాంమాతరం భజ
శైలజామాతరం విఘ్ననాయకం విశ్వసుందర. 2
శ్లో॥ మోహ కోపముఖ శత్రునాశనే సాహసాసుర విఖండ నోద్యమే
దేహిపోషరత విశ్వసుందరం పాహిభోమహిషదైత్యమర్దని. 3
గీ॥ విశ్వసుందరుఁడనునట్టి విధుసుతుండు
విరస విషమాంబకత్వంబు విడిచిరుచిర
దేహ సంపదచేత వర్తించె నేని
విశ్వసుందర తుల్యుఁడై వెలయఁగలఁడు. 4
శ్లో॥ జీయాత్సదాసుచరితం శ్రీరాజ్ఞీ రంగనాయికాంబాయాః
విద్యాధనాన్నదానై రర్జితసురధేను కల్పలతికాయాః. 5
శ్లో॥ వాడ్రేవు వంశపావనరాజ్ఞీ శ్రీరంగనాయికాంబాయాః
గాతుంచరితానివిధి శ్శేషోవా శక్నుయాన్న నాన్యః. 6
శ్లో॥ శ్రీరంగనాయికాంబా శ్చాంచల్యం పుణ్యజన్మవైరిత్వం
చండీత్వం పరిహృత్యప్రాప్య స్థైర్యంచ పాలనైశ్వర్యే. 7
శ్లో॥ సురీశ్రేణీవేణీ కలిత కుసుమాలంకృతపదా
పదాంభోజద్వంద్వ ప్రణిహితధియాం పోషణపరా
పరామాణిక్యాంబావతు సకలకళ్యాణజననీ
సదాశ్రీరంగాంబాం సకలనిజకుటుంబావనపరాం. 8

శ్లో. శుద్ధస్ఫటికసంకాశం । శూలాద్యాయుధధారిణం
ధీమేశంమానసేధ్యాయే । శ్రీరంగాంబాశుభప్రదం. 9

శ్లో. దివ్యాయ్యగారి కులరాజదుమా మహేశ
ధీరేణసంస్తుతమిదం చరితంమనోజ్ఞం
వాడేవ్రివంశ పరిపాలక రంగమాంబా
తత్పుత్రయోర్విజయతాం భువిసర్వకాలం. 10



## మ॥ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు.

సీ. నవమల్లికా ప్రసూన మతల్లులనమించె
శ్రీరాఘవుని శిరస్సీమనెవ్వి
తరళతారాగణ స్ఫురణఁ దాల్చెవినీల
ధారాధరాభ గాత్రమున నెవ్వి
అనురాగజనిత ఘర్మాంబు బిందుచ్ఛటా
గమరేఖఁదాల్చె నంగమున నెవ్వి
సురసమూహవిసృష్ట సుమవృష్టిదలపించె
నవవివాహ సభాంగణమున నెవ్వి

గీ. స్వీయకళ్యాణవేళను దోయిలించి
పుడమి కానుపురాముపైఁ బోసెనెవ్వి
విమలమగునట్టినేస ముత్యములగములు
సిరులొసఁగుగాక నీవధూవరుల కెలమి. 1

సీ. అనుకూల దాంపత్యమున కుదాహరణమై
యలరు వారి పరస్పరానురాగ
మాత్రమొక్కటెకొ భార్యాభర్తలకును బొం
దులు మాత్రమేవేఱఁ దోచుగాని

పతి శరీరంబులోపల సగంబిల్లాలి
దనుపలుకు వాస్తవంబయ్యె వీరి
కరచిన్నమంతేని కొఱంతయెందును లేదు
ధర పండువంటి కాపురమునోరి
గీ. రనుచుఁ బ్రజలెమ్మువేనోళ్ళ నాడుకొనఁగ
పార్వతీపరమేశుల భరిగిగాను
ధరణిఁ జిరకాల మీవధూవరులు కీర్తిఁ
బరగుదురుగాత సౌభాగ్య గరిమచేత. २

సీ. జవదాటి యెఱుఁగదీ యువతీలలామంబు
పతిమాట యామెకుఁ బసిఁడిమాట
అత్తగారన్నచో నత్యంతమగు భక్తి
ఆడుబిడ్డలన దివ్యానురక్తి
తలలోనినాల్కగా మెఁలగుఁజుట్టాలలోఁ
గలదాని ననిగర్వ కలన లేదు
చదువులలో సరస్వతియె పాతివ్రత్య
పుణ్యాంగనాశిరో భూషణంబుఁ
గీ. అనుచులోకము తనుగోని యాడుకొనఁగ
నించుకేనియు వేలువంపించుకొనక
ధాత్రినూరేడు లైదువతనము మాయు
శీలి! బాలాత్రిపురసుందరీ లక్షాంగి. ३

మ. కవివాక్యంబులు తప్పిపోవనెడు లోకఖ్యాతికిన్ లోటుదే
కవివాగత పత్కవీంద్ర నికరోక్త శ్రీకరాశీర్వచః
ప్రకరశ్లోకము లర్థగాములగుచున్ వ్యాసాదిమౌనీంద్ర వా
క్యవిధిన్ జెల్లునుగాక దంపతులకున్ గళ్యాణపూర్ణంబులై. ४



## మ॥ బయపునేటి వెంకటజోగయ్యగారు.

ఉ. రాయ భుజంగరాయ మహరాజబిడౌజ కవీంద్రచంద్రమా
ధీయుతులై నమీరలు విధేయున కన్పినలేఖగాంచ నెం
తేయెదసంతసించె, జగతీధవ! యేనొక పండితుండనా
నాయెడమీకుగల్గు కరుణారస మట్లొనర్చించె వింతగాన్. 1

క. సుడిగాలి జిక్కి వెల్వడి
కడుముదముననోడరేవు గాంచినభంగిన్
విడివడి నావలనెల్లరు
నడచిరి వాడేవ్రిపుడేరు న్యాయముగురిగాన్. 2

క. వ్యవహార లంపటంబున
దవిలిపెండ్లిజూడరాక తడసినకతనన్
గవిస త్తమ! క్షమియింపుడి
యవిరళమతితోడ జోగయాఖ్యుని నిపుణున్. 3

క. పండితుల కష్టమెల్లను
పండితులకె విశదమగును పండితవర్యా
పండితుఁడగానుసుండీ
మండితగుణ దోషములను మన్నింపఁదగున్. 4

ఉ. శ్రీకరి వాడరేవు కులశేఖరి దొడ్డమపేట కెన్నర
త్నాకరివంచు నెంతురుగదా ముదమందుచు బండితాళిల
త్ప్రీకరి రంగనాయకమ కీర్తి విశారదవమ్మపేరిమమీ
స్వీకరపుత్రి పెండిలి యశస్విదిగానర్కిఁ గొమ్మసమ్మతిన్. 5

ఉ. విందుము విశ్వసుందరుఁడె పెండ్లికుమారుడటంచు నెంతయున్
సుందరగాత్రియా త్రిపురసుందరి పెండ్లికొమార్తెయంచు వా
యందము చందముంగని బుధాళులు సంతసమంది పొంగిరే
ముందెపుడిట్టి ముద్దుమొగముల్ గనియుంటిమెరంగమాంబరో. 6

గీ. రూప నామంబులొక్కటే రూఢిగాను
కూర్చి దాంపత్యమున కేమికొదువ యంచు
రంగనాయికదేవి యీ రసమెరింగి
వియ్యమందిన నేర్పది వింతగాదె. 7

క. చిత్రపటంబుల రూపులు
నేత్రోత్సవమొదవజేసి రెగడెనుసుండీ
స్తోత్రంబులేలమిక్కిలి
పాత్రులు దంపతులుమిగుల భాగ్యములందున్. 8

సీ. మున్ను కౌసల్యకు గన్నులపండువ్వ
గావించె నే పెండ్లి గారవమున
అల సుభద్రకుచక్షు రానంద మే పెండ్లి
యొనరించె నెంతయు నొప్పుమిగిలి
పద్మాలయకు నేత్ర పర్వం బొసంగె నే
పెండ్లిని సొంపెల్ల జెర్రిమదీర
తొల్లి రుక్మిణిదేవి కుల్లాసమొదవించె
నే పెండ్లిచొప్పెల్ల నెలమితోడ
గీ. విశ్వసుందరు పెండ్లిక్షు వేడ్కమీర
రంగనాయికమణి యంతరంగమునకు
నట్టియానంద సందోహ మందజేయ
త్రిపురసుందరికోర్కెలు దీర్చుగాత
అనుచు వేంకటజోగయ యభినుతించు. 9

## మా॥ తిరుపతి వేంకటేశ్వరకవులు.

శ్లో. ఐశ్వర్యవంతంకుర్యాత్త్వాం సతతంరంగనాయికా
కుర్యాచ్చిరాయుషంధాతా విశ్వసుందరభూవిభుః. 1

శ్లో. దంపత్యోరనయోర్భ్వాయా కుమారశ్చతనూభవః
గౌరీశంకరయోర్లక్ష్మీ పద్మలోచనయోరివ. 2

శ్లో. తల్పంమేకో౽ధిశేతేతరుణి! బతశయేతల్ప ఏవాస్మదీయే
కస్త్వంభర్తాకపర్దీతవ మమతుపతిర్భాతి మాన్నైకపర్దీ
ముగ్ధే౽హం నీలకంఠోనహినభుజగభుక్తే పతిర్నాగభూషో
గచ్ఛత్యుర్వీధ్రపుత్ర్యాపరిహసితతమో దంపతీపాతుశంభుః. 3

శ్లో. యంభుజంగం సమాసాద్యకవితా వారకామినీ
అత్యాక్షీదితరాంత్సోయం జీయాల్లకవరాధిపః. 4

(అర్థము.)

1. రంగనాయికా=మహాలక్ష్మి. రంగనాయికమ్మగారని వ్యంగ్యము.
2. తనూభవః కుమారః=ఔరసపుత్రుఁడు తనూభవః=మన్మధుడు, కుమారః=కుమారస్వామి.
3. తల్పం=శయ్య. (భార్య) కపర్దీ=జటాజూటముగలవాడు. (గవ్వ గలవాడు) నీలకంఠః=గరళకంఠుఁడు. నెమలి. భుజంగభుక్=పాములనుతినునది.
5. భుజంగం=విటుని. భుజంగరావుని.

శ్లో. శ్రీయాదంబుజలోచనాకుశలవా లంకారకాంతోదితా
మాయాదాసమయాదృశానన మయాభర్తారమానందినీ
శ్రేయోదావిబుధా బలానత పదాసీతాభిధానాధరా
దాయాదాసదయోదయా ర్ధ్రహృదయాపాయాదిమాజంపతీ. 5

సీ. జాబిల్లితలమీది చక్కందనము సర్వ
మంగళాస్పదమైన మైపసందు
నొసలిపైభూతి మంతుండంచుఁ దెల్పు రే
ఖలుకేల ముచ్చొంక లొలయువాలు
భూతాధిపత్యంబు పొలుపుగిరీశ భా
వము చిరాయువు షత్ విమలయశము

క్ష్మాసురభోగి లోక స్తవ్య మగువిభ
వమువాహినీనర త్వంబుగలిగి
గీ. త్రిపురసుందరియను పేరి దేవిఁగూడి
సాగియువిశ్వేశ్వరుఁడు విశ్వసుందరుండు
స్వాత్మసమజేసి నిన్నెప్డు సాఁకుగాత
విశ్వసుందరరాయ పృథ్వీసహాయ. 6

మ॰ ఉరమందుంచుట దేమిగొప్ప? మొగమందుంచంగ నుంకించుట
బ్బురమా? యంచు శరీరమున్ సగముదాఁ బూబోణికర్పించిత
త్పరుఁడై యొప్పెడి రాజశేఖరుఁడు తాత్పర్యమ్ముమై విశ్వసుం
దరరావున్ గృహిణీసమేతు స్వసమున్ గావించిరక్షించుతన్. 7

మ. అనుఁగుంబేరియసి మున్నుగాలలిత నానావిర్భవంబందఁదా
నునదద్రూపము మీఱురూపమును బూనుంబుద్ధిఁబామల్ మొదల్,
దనసర్వంబు పరిత్యజించి సతిచిత్తంబెకుక్కకామేశ్వరుం
డనుదేవుండిడుఁగాక భద్రములు రమ్యంబైన యీజంటకున్. 8

సీ. ఎవ్వానితండ్రితా నవ్వారి యాకలా
సారస్య మెఱిఁగిన ధీరవరుఁడు
ఎవ్వానితల్లిలో కైక ప్రసిద్ధంబు
లగు సద్గుణంబుల కాకరంబు
ఎవ్వాని మాతా మహీయగు పెంపుడుతల్లి
రంగాంబ త్రిభువనారాధ్యచరిత
ఎవనిభావుకుఁడు భూపవరుఁడయ్యును గవి
త్వముచెప్పి మెప్పించు ధన్యతముఁడు
గీ. ఎవని భార్యనియోగులం దెల్లఁబెద్ద
పేరుగల వడ్లమన్నాటివారి పడుచు
అతఁడు శ్రీవిశ్వసుందరుం డనుగతార్థ
నాముఁడు వర్ధిలుత జమీందారుఁడగుచు. 9

చంపకమాలిక.

జనకుఁడనన్ గవీశ్వరుఁడు, శాశ్వతకీర్తి మతల్లి తల్లి, పెం
చిన యలరంగనాయికమఁ జెప్పిననోటనిఁ కేరినేనిఁ జె
ప్పనగుదురెల్లవారు, కవిపండితసంఘము నేఁడుఁగూర్చి నూ
తనమగు త్రోవఁ ద్రొక్కిన యుదారుఁడు బావ; భుజంగరావుగా
యనజనుఁడాయనీ జనసమాదృతిచే నభిధానుకూల్యమున్
గనుటయకాక భూభరణ కార్యమునందును దాదృశుండె, వీ
రిని నిటులుంచి యావయిపు రీతి గణింతమునీదుభార్య పు
ట్టినయలచోటు వైదికపు రీతి నియోగపుఁడెక్కుఁగూడఁగ
ల్గినయది సర్వమున్ సుపథిలీలఘటిల్లుటచేతఁ జూ? జయం,
బునకు నివాసమయ్యెనిది, భూసురరాజ? యికొక్కమాట, యెం
దునకునుగాని కట్టుఁబడి త్రోవలు లేనికతానఁ జామ్మిగా
యనమణిశ్రీయనీమణులు హాయిగఁబాడుట దీనఁగల్గె, నే
మనదగుశర్వణీ యిటకు నాగతుఁడైనను నాటిరీతిపా
యినిగలిగింప నేర్చెనె? య టేనియుఁ "బూరుషగానమంగనా
జనముల సంస్కృతం" బనెడిసామెతకుంగతి యేమి? పెండ్లి నే
రొనరుచుకోఁగ నిచ్ఛగల యోగ్యుల కియ్యది మార్గదర్శిగాఁ
గనపడుచున్న, దిట్టితగు గాయకులున్ గవులున్ బ్రసిద్ధగా,
యనులునుగల్గు కోటిసభ లారసియారపి నేఁడుకూపకూ
ర్తనియతినున్న మాకిపుడు మానసమెంతయు సంతసించె, నే
మన? గదవాలరాజిటు సమాదరణం బొనరించిగాయనీ
జనకవిగాయకాదులకు సంతతమున్ బ్రతివత్సరంబు మ
న్ననలనొనర్చు, నిచ్చోటఁ గనంబడవిట్టిపనుల్, భవచ్ఛుభం
బుననిదియొల్కఁ యొత్తెనిఁక ముందును నీవిదిభార్య తోడిదే,
యనిమదినెంచి కాఁదగినయట్టి విభుండవుగాన సాహితీ
వనితను గీతితోఁగలిపి భవ్యగతిన్ గనఁ జేయుచున్ జమీన్-

దనరెడితక్కువారలకు దారినిజూపఁగదయ్య? "భావనీ
కుసుమతినీవు తక్కరులకున్ గురువై" రని ముందువారు దీ
నిని గడుమెచ్చికొందురు జనించినకస్తురి వంశమిక్కతం
బునను బరీమళించిపయిఁ బొంపిరివోవుచు నోడరేవు తోఁ
వనుజగమెల్ల మొల్లపు సువాసన నిండఁగఁజేయు నిక్కతం
బున నభివృద్ధినొందెదవు పూర్వపురాజులబోలి నీవిలన్. 10

క. మొదలన్ గస్తూరీ సం
పదగల్గినయింటఁబుట్టు వడసిననిన్న
య్యాదివీడదునీవద్దా
నిదిగందొ వినను, సహజ నిత్యముకలిమిన్. 11

## సంగన్నగారిమీదిపద్యము.

సీ. భూరిశ్రవోవైరి భూతమయ్యెంగాక
పడసెనే భూరిశ్రవః ప్రియంబు
గురువిరోధంబుకై కొనిచరించెంగాక
కావించెనే గురు గౌరవంబు
రారాజుతోడి వైరము వహించెంగాక
యందెనేరాజ రాజాదరంబు
సభయంబుగానరుల్ స్వరముబాసిరిగాక
సభయంబుగా నరుల్స్వరమువినిరె
గీ. అర్జునునిచేతి గాండీవ మనుటయెట్లు
నీవు సభలోనఁ గెలబూనిన విపంచి
అన్న? తుమరాడసంగన్న నిన్నుఁగన్న
అమ్మకేయమ్మసరి పార్వతమ్మగాక.

భూరిశ్రవోవైరి భూతము=భూరిశ్రవస్సను వానికి శతృవు. భూ
రిశ్రవః ప్రియంబు=చాలచెవులకింపైనది. గురువిరోధంబు=ద్రోణాచార్యు

లతోడివిరోధము, రారాజుతోడి వైరము=దుర్యోధనునితోడి శత్రు
ము. రాజరాజాదరంబు=మహారాజుల యాదరణము. సభయంబుగా
-భయముతో కూడునట్లుగ, అరులు=శత్రులు, స్వరము బాసిరి=దచ్చి
-సభ X యంబుగా=సభ నీరగునట్లుగ నరుల్=ప్రజలు. స్వరమువిని



## మ॥ బొండాడ సూర్యనారాయణగారు.

సీ. శ్రీమీర కీలకనామ సంవత్సర
ఫాల్గునమాసానఁ బ్రాభవమున
నరుణోదయంబున నశ్వనీ నక్షత్ర
యుతగ్రాహ లగ్నాన క్షితినిగల్గు
సూరిజనుల్ మెచ్చ శుక్లచౌతిని బుధ
వారాన బందరు వాడలోన
శ్రీయుతుండైనట్టి శ్రీరాజ విశ్వాసుం
దరరావు బహదరు తగవరించె
గీ. దేవిగను శ్రీమతినిబాల త్రిపురసుందా
రాంబ నావధూవర వివాహంబు కవిజ
నాళికతులిత మోదమింపడర నొసఁగి
మేలు దీవెనలనుగాంచి మించెఁ బేర్మి. 1

క. హరిహర కమలభవులు శ్రీ
ధరజాతా శారదాంబ తరుణులతోడన్
గరమను రక్తిమెలంగెడి
కరణిని వారిలమెలంగఁగా హరిఁగొల్తున్. 2

క. కొడుకులను సంపదాళిన్
బుడమిపయిన్ బొందఁజేసి భోగములెల్లన్

గడు సంప్రీతిగ వారికి
నిడగా నతియించువాఁడ నెల్ల దివిజులన్. 3

ఆ. వె. సర్వసంపదలను సౌఖ్యమారఁగఁ గాంచి
కవిజనాళిఁ జాల గారవించి
భావవృద్ధినొందు భంగిని దలపోసి
వారువృద్ధినొందగోరువాఁడ. 4

క. శ్రీమంత్రి ప్రగడాన్వయు
శ్రీమంతు భుజంగరాయ క్షితిపునివలె నే
మేమించి పెండ్లికొడుకు కిల
లో మించుతఁ గీర్తితోడ లోకులు మెచ్చన్. 5



## మ॥ నిడదవోలు సుందరం పంతులుగారు.

సీ. సిరిమించు సెరిమించు దురళించు సరిగంచు
వరలు కడాని దువ్వలువవాఁడు
పగడంపు జిగిపెంపు నొగలించ ఒగుసొంపు
నెగడు లేయడుగుల సొసగువాఁడు
క్రొందమ్ము లేదమ్ము ముదమ్ము చేదమ్ము
చేదు వాల్గన్నుల చెలువువాఁడు
తులలేని వలరేని నెలరేని లలిఁగాని
యలరారు మేనిసోయగము వాఁడు
గీ. మేలుజేజేల రాచఱాఁ డాలువాఁడు
వాడరేవు కులాబ్ధి పార్వణ శశాంకు
విశ్వసుందర రాట్ప్రభు వీరమాత
రంగనాథుక మను మేలొసంగి మనుచు. 1

శా. గంగావాహినిరీతి వెన్నెలగతిం గల్పద్రుమం బట్లు సా
రంగాంకాకృతి వెండికొండ సరణిన్ రాయంచ భంగిన్ దరా
భంగస్ఫూర్తిఁ బటీర శోభబల భిద్వాహంబు చందంబునన్
రంగాయమ్మ యశంబు నిండుకొనియెన్ త్రైలోక్య మబ్రంబుగాన్

సీ. రారాజుసభకు జేరనినాటి ద్రౌపది
జసనాధునిండ్లకు జననిలచ్చి
నహుషుఁడాసిఁపసి నాటిపౌలోమిస
పత్నితోఁ బోరని పర్వతసుత
వనములో భర్త బాయనినాటి దమయంతి
సౌమిత్రిదిట్టని జనకతనయ
మునియంచు శక్రునిగనని నాటియహల్య
వనజాక్షుపై నలుకఁగొనని సత్య

గీ. వాడరేవృసులాబ్ధి పార్వణశకాఁక
విశ్వసుందరరాట్ప్రభు వీరమాత
రంగనాయిక దేవితోడంగరంబు
సాటియగునేమొ యితరుల్ల మాటయేల 3

## మ॥ శ్రేయోభిలాషిగారు.

చ. భళిర కవీంద్ర రత్నముల భాసిలునీసభ కృష్ణదేవ రా
యలటు వసంతకాలముల యందొనగూర్చిన వానిబోలె, సౌ
మ్యులగు కవీంద్రులిచ్చు వరముల్ గొని సౌఖ్యములందుమీ సతిన్
గలసిచిరాయు రున్నతుల గాంచుము మించుము విశ్వసుందరా.

4

## మ॥ శ్రీపాద శివరామసిద్ధాంతిగారు.

శ్లో. శ్రీమత్పూర్వ నిశాకరా వవనిభూ స్సోమాత్మ జన్మాగురు
శ్శుక్రక స్సూర్యసుత స్తథాతిమహిమా శ్రీసైంహికేయ శ్శిఖీ
శ్రీమాద్గల్యాస గోత్రపావన మమ శ్రీ రంగనాధాంబికా
సూనుం రక్షతు విశ్వసుందరవిభుం భార్యాయుతం సర్వధా.



## పద్యములువ్రాసిన కాగితముపైని సంతకము లేకుంటచేఁగవిపేరు గ్రహింపఁజాలమైతిమి.

గీ. ధనము విద్యయు నాయువు పెనగొనంగ
విశ్వసుందర నామంబు వినుతికెక్కి
నీతిచంద్రిక పెదజల్లి నేర్పుమీర
భువిప్రకాశించుగాత సద్బుధులు పొగడ 1

సీ. చంద్రమతిగూడి యల హరిశ్చంద్ర నృపతి
సత్యవాక్పరిపాలన సలిపినటుల
త్రిపురసుందరి గూడి వర్తింతుగాత,
నిర్మలంబైన సత్కీర్తి నెగడుచుండ. 2



## మ॥ కర్రా పాపయ్య శాస్త్రులుగారు.

శ్లో. విశ్వసుందర మనోహరాకృతీ విశ్వలోకపితరా రమాహరీ
విశ్వసుందరవిభుం సతీయుతం సంతతం సమవతాం దయాయుతౌ

శ్లో. నాకాశీర్షకులోద్భవం ప్రభువరం పత్నీయుతం బాలకం
సూరివ్రాత కవీశ్వరాఘ శుభకృ త్సద్బాంధవై ర్వేష్టితం
నానాదేశ సమాగతాన్ బుధజనాన్ సంభావయంతంవరం
ప్రజ్ఞావాంచిత విశ్వసుందరమముం రక్షేదుమానాయకః. 2

## మ॥ వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.

శ్లో. అజీకలో త్వధికముల్ల సతాహృదాబ్జ
భాస్వచ్ఛచీ క్షణ ఇవా యమనారతంచ
శ్రీ విశ్వసుందరవిభు శ్రితకల్పకస్స
ద్గోత్రోద్భవాం త్రిపురసుందరితోల్లసంతీం. 1

క. ఎందాక బుప్పవంతులు
కందోయి వృషాకపాయి కాంతయుగాఁగన్
బొందునుమ్ముదము వృషాకపి
యందాకం దంపతులకు నయ్యెడు శుభముల్. 2

శ్లో. భుజఙ్గాభిఖ్యాసంకలిత కవిరాజద్బుధగురో
త్రిలింగశ్రీసీమన్ జితమదనతేజో విభవతః
దయాచ్ఛే శ్రీకంఠ శ్రితజన సురాగాత్రనకథం
భవంతం సర్వజ్ఞం విబుధసమవాయః కలయతి. 3

ఆర్యవర్యులారా! తారంచితదయఁబంచిన సంచికనుగాంచి ముదంబుగాంచి సముదంచితమతినై రాసంకీంచియు నావిరించి తలంపున సంచితములు ననివార్యములునగు యాచకార్యములు నిరోధించుట నమ్మహోత్సవమవలోకించు భాగ్యంపు దుర్లభత మదినెంచుచు గృతజ్ఞతాపూర్వకంబుగావధూవరుల నిట్లాశీర్వదించితి గాననే గవిపండితసభ కేగంజాలని లోపంబికక్షమ్యం బమ్మిన లోపమ్ములతో మాపమ్మిమ్ములఁ బరిపకివిధమ్ములఁ బ్రార్థించుచున్నవాఁడ.

1 పద్యమునకు.

భుజఙ్గాభిఖ్యా సఙ్కలిత=భుజఙ్గనామక. (అన్యత్ర సర్పశోభాయుత. కవిరాజద్బుధగురో=కవిశ్రేష్ఠాయితపండిత శ్రేష్ఠ(అన్యత్ర. కే, శిరసి, విరాజమానః బుధగురుః చన్ద్రః యస్యతస్యసంబుద్ధిః) బుధస్య చంద్రపుత్రత్వా దితిభావః) త్రిలిఙ్గ శ్రీయః త్రిలిఙ్గభాషాయాః సీమన్, సీమాయిత, తత్రనిపుణేత్యర్థః, (అన్యత్ర త్రిలిఙ్గభాషాయాః శ్రీశైలద

తా రామ కాళేశ్వరాత్మ కలిఙ్గత్రయ మధ్యవర్తిదేశప్రవర్తమానత్వా దితిభావః) తేజోవిభవతః కాన్త్యతిశయేన) జితమదన మదనాతిశాయి రూపవన్నిత్యర్థః) అన్యత్ర (హతమదనదయాబ్ధే=దయాసముద్ర (ఉభయత్ర సమానమేతత్) శ్రీకంఠ=శ్రీః సరస్వతీకంఠే యస్యతస్య సంబుద్ధిః. (అన్యత్రగరళకంఠ) శ్రితజనసురాగ=ఆశ్రితజనబద్ధరాగ, ఆశ్రిత కల్పవృక్షేతివా (ఉభయత్ర సమానమేతత్) సర్వజ్ఞం=సర్వవిదం (అన్యత్ర ఈశ్వరమిత్యర్థః ద్వయం యోజనీయం.

8 పద్యమునకు.

అబ్జభాస్వచ్ఛుచీక్షణః=పద్మనేత్రః, శ్రితకల్పకః=ఆశ్రితసురద్రుః శ్రీవిశ్వసుందరవిభుః=తదాఖ్యః అయం శ్రీభుః, సద్గోత్రోద్భవాం=ఉత్తమగోత్రజాతాం, త్రిపురసుందరిత్రోల్లసన్తీం=త్రిపురసుందర్యాఖ్యాం, శ్రితకల్పకః, విశ్వసుందర విభుః, అబ్జభాస్వచ్ఛుచీక్షణః, సద్గోత్రోద్భవాం, త్రిపురసుందరీమివ, అనారతం, అధికముల్లసతా, హృదా, అంగీకరోతీత్యన్వయః, ఉపమానవాక్యేఽర్థత్రయం యోజనీయం.

I అబ్జభాస్వాన్ శుచీక్షణేయస్యసః, విష్ణుః, త్రిభిఃపురైః దేహైః. లక్ష్మీసీతారుక్మిణీరూపైస్సుందరీత్రయాఉల్లసన్తీం,సద్గోత్రోద్భవాం, భూపుత్రీం, అథవా, గోత్రపజాన్నిత్యాస్యతిమై నాకమితి గోత్రస్సముద్రఃతజాం, అధికముల్లసతా, హృదాలక్ష్మీః విష్ణువక్షుస్థలస్థితత్వాదితిభావః.

II అబ్జః, చంద్రః, భాస్వాన్, సూర్యః శుచిరగ్నిఃతే అక్షిణీయస్య స ఈశ్వరః- సద్గోత్రోద్భవాం, హిమవతఃపుత్రీం త్రిపురసుందరీం బాలాం, అధికయాముదా ఉల్లసతా, హృదాచిత్తేన, అంగీకారశ్చాత్ర అంగతాపాదనమితిజ్ఞేయం.

III అబ్జభాస్వచ్ఛుచీక్షణః, ఈశ్వరః, సద్గోత్రోద్భవాం, హిమవదుత్పన్నాం, (గంగాయాహిమవతః ప్రభూతత్వాత్) త్రిపురసుందరీం, త్రిభిఃపురైః మందాకినీ, గంగాభోగవతీరూపైర్దేహైః సుందరీం, అధికం, శిరసి, కే, అధికం, (విభక్త్యర్థేఽవ్యయీభావః)

సర్వత్ర త్రిపురసుందరితీతి ధర్మోవివర్తతే, తయా ఉల్లసంతీస్నైవ త్రిపురసుందర్యేవ భవతీతి త్రిపురసుందరితోల్లసంతీత్యస్య త్రిపుర సుందరిత్యేవార్థః. త్రిపురసుందరిపదస్యవసంత తిలకాయామఘ టనీయతయా తధాకృతమితిజ్ఞేయం.

3 పద్యమునకు పుష్పవంతులు, రవిచంద్రులు. వృషాకపి శివుఁడు. లేక విష్ణువు, వృషాకపాయి, గౌరి లేకలక్ష్మి.

గూఢశ్లేష శంకితమతినయి యిట్లుసూచించినందుకు క్షమింపబ్రార్థించుచున్నాను. తప్పులు క్షమింప బ్రార్థించెద.



## మ॥ శ్రీ రా వీరబ్రహ్మముగారు.

షోడశదళపద్మబంధ సీసపద్యము.

గీర్వాణినల వల్లకీరావ కరణి ప,
ద్యావద్భూవతంసగీ తాళిపోల్చ
కర్ణాటపాటవా కర్ణతకలితోరు
కౌతుకంబు సొనాయి గ్రాలదెలుప
సూరివరజనాళి జ్యోత్స్నవ మాగధ
సంతతుల్ శశ్వద్యశంబు నెన్న
కన దభినవ్యోద్యార్యజన మృదుమధురసాం
చిత సూక్తులాలుక నాశీస్సులొప్ప
గీ. రాణ వైవారమానస ప్రియులైన
యా ప్తనికరోల్లసపు తీవులలర రమ్య
గంధమలఘుతతామోదీ కరమునొచు
నబ్బురంబింపు హృత్కంజ హృద్యంబుగాగ
నహహ యకలంక గతిని కళ్యాణమయ్యె. 1

శా. శ్రీరామా స్తన గంధసౌరభనవ శ్రీదేవి సంతోషమిం
పారన్ భూరిఫణాగ్ర రత్న రుచులా శాలింబదీపింపగం

క్షీరానేక శిరాళిబొల్చు యహిపై వేడ్కన్ సతీయుక్తుఁడౌ
శ్రీరంగేశ్వరుఁ డీవధూవరుల నాశీర్వాదముల్ జేయుతన్. ౬

## మ॥ నందిరాజు చలపతిరావుగారు.

సీ: శ్రీరంగనాయికాంబోగువు పైనుండి
కొమరైన కథలచే గులుకునపుడు
అంటినగందుదు వంచునిన్ బందుగుల్
మించి కన్నులఁ గౌఁగిలించునపుడు
ఈడు బాలురతోడఁగూడి విద్యాభ్యాస
మాచరించుచు మోదమందు నపుడు
వ్యవహార నీతుల దవిలి గ్రహించుచు
చతురత్వమును వెద జల్లునపుడు
గీ. ఎఱిగియుంటిని నీసౌరు లింపుగుల్కు
త్రిపురసుందరితో నేడు దేజరిలుట
గంటినానాట నీసిరి కన్నుగవకు
సరిదిగలిగించె విశ్వసుందర కుమార! ౧

ఉ. సుందరగాత్రియౌ త్రిపురసుందరి ఛంగరు తీవయద్దినిన్
పొందుటచేతగల్గెగద పొల్పగుకస్తురి మేలితావి యా
గంధము నీకు బుట్టువున గల్గెగదా యిటుమీర లిర్వురుం
జెందుడిదీర్ఘవైభవ మశేషసుఖంబుల్లు విశ్వసుందరా! ౨

సీ. ఇప్పుడు పెండ్లికై రంప్పించుపొలిక
నెల్ల చుట్టములతో నెసఁగుమయ్య
ఇపుడు విద్వత్కవి హితముఖ్యులనుబోలె
నెల్లకాలముగూర్చి యేలుమయ్యా
ఇపుడు వైణికవాంఛ లేచ్ఛ జనించిన
పోలిక నిత్యంబు బూనుమయ్య

ఇప్పుడు వధువుపై నింపొందు రాగంబు
వర్ధిల్లజేయుచు వరలుమయ్య
గీ. దాన సత్సంతతులు భూరి దానవిభవ
మైహికాముష్మిక సుఖంబు లనుభవింపు
మిత్యుదియెకాదె సకల సమీహితంబు
విశ్వసుందర వెళ్ళేండ్లు వృద్ధిబొందు. 3

ఉత్పలమాలిక.

మానవుఁడౌట పూర్వభవ మానిత కర్మ విశేషలబ్ధమా
దానవరుండు దారగతి దార్కొనుగావున నిట్టిసంగతిన్
మానసమందు నిల్పి పెర మానిసులం దనురాగ మెప్పుడున్
మానకయున్న నీర్ష్యయును మత్సరమాదిగ దుర్గుణంబులున్
మానును మోదముప్పతిలు మంచిగుణంబుల మేటిరాశియా
మానిని శాస్త్రచోదిత సమంచిత ధర్మ విధింగరంబునన్
బూని దృఢానురాగమును బొందఁగ సద్ధన, ధర్మ, కామ ని
ర్వాణ సుఖంబులెల్ల దన పాలిటివౌ మఱియెట్టి యీడు నా
డేనడతం జరింపనగు నేగతి నింతికి నింపుసొంపు నా
నానడలూని యాత్మమదిమధ్యముగా ధనముబ్బఁజేసి య
న్యూనగుణౌఘ బీజముల నోర్మిమెయిన్ వెదజల్లెనేనియున్
వానికినాఁడు నాటికభి వర్ధనమేపును గల్గియవ్వియిం
పూనును, గానఁదాను సతియున్ మది భేదములేక యామెయే
తానును దానెయామెయనఁ దత్త్వగతిం దమరేక భావమున్
బూనుటగల్గు నిట్లుగల పూరుషుపాలివి యెల్ల భాగ్యముల్
పూనికసాఁగు నెల్లెడలఁ బొంపిరివోవుచుఁ దద్గుణాళిలో
కానజనోప యుక్తతనుఁగాంచును, జవ్వన మిట్లుసాఁగ సం
తానము విస్తృతిం దనరదానికతంబున బంధులోక స
మ్మానము గాంచి వారిదగు మన్ననచేఁ బరితుష్టిజేయుచున్
బూనిక దైవమిచ్చిన యపూర్వపు టాజ్ఞల జేయుచుంటమే

తానననేను నీపరిణయంబునుగాంచఁగ లాభమింతయున్
గానఁగరాదటంచనకకౌతుకవృత్తిని నెల్లవారలున్
గానఁగ వచ్చినట్లు మన కార్యముగాదని తోఁచిపుచ్చుక
వ్వానికి నెట్టిలోటులును బాల్పడకుండ సహాయభావమున్
మానుగ బూనియుంట కడు మంచిదిసుమ్మి దె పూరుషార్థమున్
గానను నీదుభావయతి గౌరవమొప్పఁగఁ బండితాళి స
న్మానము చేయునట్లు జన మాన్యభవజ్జనయిత్రిబంధులన్
దానతి రక్తిగాఁచుగతిఁ దండ్రియు నేర్పరియౌచుఁగార్య సం
ధానమునందుఁ బ్రౌఢిమము దాల్చినవ్రోలిక వానిఁజేయుచున్
దీనిధివాచుఁ బెద్దల మనీషులచె ల్లియునట్టి దాని చే
నీనడలెల్లవారలకు నెమ్మినొసంగఁగఁ దీర్చికొంచు దు
ర్మానవజాతి చెంగటికి రానెడమియ్యక బాంధవావళిన్
సానునయంపు వాక్యముల నాదరిణంబునఁ జూచె దేనిని
న్నానని యెల్లరుం బొగడ నర్హుఁడవౌదువు దానవార్థు
దానను లౌచు దీవెన లనంతముగానిడఁ బెక్కేండ్లు నీ
చాన్దనుగూడి నిశ్చలత సౌఖ్యమునందుచుఁ బుత్రిపౌత్రి సం
తానమునందివర్ధిలుము ధర్మసమాదృతిఁ బిశ్వస్యుందరా! 4

## మ॥ సత్యవోలు అప్పారావుగారు.

ఉ. శ్రీసతియుల్లసోక్తులను చిత్తమునరి దలపోయుచుండి యు
ల్లాసములోడఁగాఁగిటను లాలనఁజేసెడు వేళకోరికల్
వీసరబుచ్చుకేమెలఁగు వింతలుకర్గె నితాంతభావముల్
తాసమకూర్చుకేశవుఁడు ధన్యునిజేయుత విశ్వసుందరున్. 1

సీ. పునుకదండలదీసి పులికళాసముదీసి
పీతాంబరంబులఁ బ్రీతిబూని

విదియచందురుదీసి వింతజడలదీసి
కూకటిపెన్నెరు ల్గూడగట్టి
ఫాలనేత్రముదీసి ఫణిభూషలనుదీసి
జలతారుకుళ్ళాయి తలనుదాల్చి
పాపపేరులుదీసి భస్మంబు త్యజియించి
ముత్యాలసరములు బూరటించి
గీ. త్రిపురసుందరి వరియింప దివ్యసుంద
రాకృతినిదాల్చి వాడరే వాన్వయమున
నవతరించిన శివుఁడన్న నల్లురుటరుదె
విశ్వసుందరనామంబు వెలయుచుంట. 2

గీ. ధరను వర్థిల్లు విశ్వసుందర సమాఖ్య
ధర్మపత్నీసమేతుఁడై తనరుచుండి
త్రిపురసుందరి గుణమణి తేజరిల్లు
సాధ్వియైపతిభక్తితో సంతతంబు. 3

## మ॥ తాడిమళ్ళ నారాయణమూర్తిగారు

శ్రీవృత్తము.

రా (జా) వా(దేశు) రం (గ) నా (యకమ్ము) 1

కన్యావృత్తము.

ఆహ్వానంబుల్। వహ్వాయంచున్। బహ్వానందం। పాహ్వానంబౌ. 2

స్వాగతవృత్తము.

క్షేమమాబుధులు ? నేమమెవిప్రుల్ ?
క్షేమమాకవులు ? నేమమెమిత్రుల్ ?
క్షేమమాజనము ? నేమమెబంధుల్ ?
క్షేమమాసుతులు ? నేమమెనారుల్ ? 3

మాత్తికమాలావృత్తము.

భూషణముల్ వేఱెపాదుగనేలా
భూషలకున్ వన్నెపాలయువారల్ ?
వేషముసాజమ్ము వెలయుచుండన్
దోషముశృంగార తొడవులుంపన్. 4

మణిగణనికరము.

సతిపతులొకరయి సరసగతినరుం
ధతితనపతియును దనరినవిధమై
యతులితశుభముల ననవరతముఁబొం
దితరణివెలిగెడిదినములుమనుతన్ ? 5

చంద్రకళ.

కోరుకోరుకలు దైవమొసంగున్ గోధనధాన్య సమృద్ధియౌ
చేరుపేదలు చెందుదురెల్లన్ సిద్ధినిబొందెదు కార్యముల్
వారువీరను భేదములేమిన్ వర్ణవివక్షత లేకయే
సారెస్వారెకు సాయముఁబొందన్ సాగుచునుందురు రిచ్చటన్. 6

కవికంఠభూషణము.

కవికల్పభూజములుగారె మహాత్ములు పేరుపేరునన్
కవియన్నవారలకు గౌరవుఁజేర్తిని వార్తలంపుచున్
కవికట్నమిచ్చెదము కానుకలిత్తుము రండిరండియో
కవిపుంగవుల్ సభకుఁ గండ్లకువిందులు సేయుఁడీయనన్. 7

మణిమాల.

కవితన్ సలక్షణముగన్ వికాసమును జెందఁజేయుదురుగా
కవిశేఖరుల్ తిరిగితొంటి గౌరవము నొందుచున్నయెడలన్
సువివాహముల్ జరుగుచోట నూరిజను లెల్లరొక్కసభయై
కవిశేషలాభమొందవున్ విడంబనము సంప్రదాయమగుటన్. 8

### మంగళమహాశ్రీవృత్తము.

చెంగలువతోరణము చెన్నలరఁబందిరుల సేవకులు జేధ్వనుల మ్రోయన్
అంగజునిరూపమున నరుఁనుని దేజమున నాయువున శేషునినిబోలన్
అంగనలుముచ్చటల నందముగ నాడుచునహర్నిశలు నొక్కత్రుటిసేయన్
మంగళముబాడుదురు మానవసువాసినులు మాధవుఁడు దీవన లొసంగన్. 9

ఆర్యవర్యులారా!

తామహీన కృపా విశేషంబునం దయచేసిన శుభలేఖ గ్రహించి చిత్త కుతూహల వీచికలఁదేలుచు వివాహమహోత్సవ దర్శనాయత్తంబయి నచిత్తంబును మరలుగొలిపి ఆయకులకంటె బాలురకు వైభవావలోకనేచ్ఛమెండని మతిఁవితాకన్యను యుష్మచ్ఛోభన మందిరమునకు నాకుం గల స్వల్పవస్తుసముదాయము వధూవరులకుఁ గానుకగా సమర్పింపఁ బంపితిని గాన బాలయగు నయ్యాబలసురక్షితముగ గమ్యస్థానముఁజేరిన శుభవార్తనాకుఁ కర్ణామృతంబు.

---

### మః॥ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రిగారు.

శ్లో. శ్రీబాలాపతిసంగతాభిరమతే నిత్యం ప్రజానందితా
శశ్వన్నందతు విశ్వసుందరవరః పత్నీకృతైరుత్సవైః
సాహ్లాదాపతురంగనాయక మహారాజ్ఞీ ప్రవృద్ధాతయో
ర్దంపత్యోశ్చిరజీవినోరవిరతం కళ్యాణపారంపరీం. 1

శ్లో. విశ్వసుందరవాల్లభ్యా ద్బాలాత్రిపురసుందరీ
అనన్యకన్యాసామాన్య లావణ్యేత్యనుమీయతే. 2

శ్లో. బాలాత్రిపురసుందర్యాః కరగ్రహమహోత్సవాత్
విశ్వసుందరసన్మూర్తి రాజతేరాజశేఖరః. 3

శ్లో. తయోస్సుందరయోః కన్యావరయోరనురూపయోః
అవినాభావసంబంధః కస్యనస్యాన్మహోత్సవః. 4

శ్లో. పరస్పరానుబద్ధం తమన్యోన్యానుపఘాతకం
త్రివర్గం సేవమానాత్తా జీవతాంశరదాంశతం. 5
శ్లో. ఏవమాశీఃకృతామోదే కుద్రుసద్గ్రామవాసినా
ధరామరేణ కొంపెల్ల సుబ్రహ్మణ్యమనీషిణా. 6

## మ॥ శేతమంగలము వెంకోబారావుగారు.

అయ్యా!

తాము పంపిన శుభలేఖలంజూచి యెంతయు సంతోషించితిని కవి పండితజనుల సమావేశమప్పుడప్పుడు కలుగుట మిక్కిలియనుకూలమే?

నేనీకర్ణాటక దేశమందుండుటవలన నాంధ్రభాషాసేవనుజేయుటకు, అవకాశములేకయున్నను భాషయందభిరుచిమాత్ర మప్పటియట్లున్నది తాము నన్ను స్మరించి జాబువ్రాసినదియెక్కువ. తమయుద్దేశము నెఱవేరినవిషయమందు జాబువ్రాయింపవలెనని వేడుచున్నాను మఱచి కర్ణాటకలిపియందు వ్రాసినాడను. మన్నింపుడు.

కొంగురుకవిబుధ వాణీశ్వర
వరమంగళవాగ్వితాన వ్రతులరైశ్రీ
కిలపాపగ్రహభీతిన్
స్మరియింపకలరుడుపూర్ణ చంద్రద్యుతితోన్.

## మ॥ క. భాస్కరరావుగారు.

ఆర్యులారా?

కళ్యాణ మహోత్సవకారణంబున, నానా నగరంబులనుండి మాపురంబునకు విచ్చేసి మమ్ములధన్యులుగ నొనర్చిన పండిత శిరోమణులగు మీకెల్లరకు వందనంబుల నర్పించుచున్నారము. పరమహర్షోత్కర్షంబులు మనంబునం బెనగొన మాయాంధ్రభాషాభివర్ధనీ సంఘమువారు మీకత్యం

తవినయంబునఁ బ్రియంబున స్వాగతం బొసంగుచున్నవారు. భద్రాత్ములగు మిముబోని పెద్దలరాక యెల్లరీతుల నిప్పట్టణ భావికాలాభ్యుదయ సూచకంబగు నంచు నెంచెద. ఈపుణ్యదినంబు బందరు పురచరితంబునం జిరకాలంబుకడుంగడు నెన్నఁదగియుండు.

ఆంధ్రభాషాభివర్ధన పరాయణులు నిస్తులధిషణా ధురంధరులుపరమదేశాభిమాన మాననీయులగు మిమ్ములను సందర్శించు నీ సమయంబున మస్మనంబు స్వదేశభాషావిషయంబుఁ గూర్చి యొకించుక ముచ్చటింప ననుంబురికొల్పెడి. మనభాషపై నభిమానముంచి తద్గత వర్తమానస్థితిగతులనారసి తద్వర్ధనమార్గంబులం బర్యాలోచించి నిశ్చయించు తలంపుఁగల్గి యిట్లుకోవిదులు సభకూడుటఁజూడ మన యాంధ్రంబిక శుక్లపక్షసుధాకరుని చందంబునం బెంపొందుచు మనదేశంబును వెలయించుననుటకు సందియంబు లేదుగదా. పదివత్సరంబుల క్రింద నిట్లాంధ్రాది ద్రవిడభాషల నెల్ల నుద్ధరింప నొకపూజ్యుని ప్రేరణంబున సంఘం బొండు చెన్నపురియందేర్పడియె. అయ్యది కొంత మనభాషకును నుపకారంబొనర్చెఁగాని వలసినంత చేయకయ కీర్తిశేషంబయ్యె. అప్పటినుండి యిప్పటివఱకును దాని బునరుజ్జీవింపం జేయఁదలంచువారైన లేరైరి. రెండు నెలల క్రిందట చెన్నపురియందు మరల దేశాభిమానులు కొందఱాంధ్రభాషాభివృద్ధ్యర్థ మాలోచింప నొకసభగూర్చిరని వింటిమి. తత్కార్య నిర్వహణమునకు వారెట్టి మార్గముల నేర్పఱచుకొని యిందనుక నేమి యొనర్చినదియుం దెలిసి యానందింప నాంధ్రప్రపంచంబు వేచియుండెడి. మనముద్దేశించిన కార్యం బెయ్యదియైనం బ్రత్యక్షక్రియారూపంబునం బ్రకటంబైనఁగాని మనయుద్దేశంబునకొక ప్రయోజనంబు గలుగదు. కావున, మనభాషయున్న నికృష్టదశకువగచి తదభివృద్ధి నిగూర్చి వలయు ప్రయత్నములొనర్చు టవశ్యకర్తవ్యంబంచునెంచి శ్రీమునగాల జమీందారుగారు మున్నగు పరమదేశాభిమానులు విజ్ఞానచంద్రికతోడ మనయాంధ్రప్రపంచంబును గొన్నిమాసములుగ వెలయించుచున్నవారు. వారికిందోడుగ నీబందరుపురమునందును భాషాభిమానవిధానులు కొందఱాంధ్రభాషాభివర్ధనియను పేర నొక సంఘముగ నేర్ప

డిరి. ఇపుడీసంఘమున మన తెనుగుజిల్లాలలోనున్న ప్రముఖుల నేకులుగలి సిమనభాషాభివృద్ధికిం దోడ్పడుచుండుటకుఁ జాల సంతసింపవలసియున్నది. అయిన నిందనుక మనభాషారమణి యెట్టి మార్గములంబయన మొనర్చిన గమ్యస్థానంబుఁజేర్చి కృతకృత్యతఁగాంచగలదోయను విషయమును నిర్ధారణ సేయఁగల్గునట్టి పండితబృందం బొకయెడఁ గూడుట సంభవింపమియెరొక లోపంబుగనుండె. అదియును శ్రీశ్రీరాజా మంత్రి పెగడ భుజంగరావుగారి ప్రయత్నంబున నేటికి నివర్తింపఁబడినందులకు వారికనేక వందనముల నర్పించుచున్నవాడను. ఇట్టిమహోత్కృష్ట సమయంబు సఫలంబగునట్లుగ సభాసదులగు కోవిదతల్లజులు మనభాషాభివృద్ధి విషయ[illegible]ప్రామాణిక మార్గంబు నుపదేశించు వారగుదురుగాత.

నవరసాలంకార భూయిష్టంబులై చదువరులమనంబు లపహరింపం గల్గు పద్యకావ్యము లమందానంద సంధాయకంబులైయైనను నిజముగమ నదేశాభివృద్ధిని మదినెంతుమేని యెల్లప్పుడు వానితో మనము తృప్తినొంది యుండఁజాలము. తీయఁగానుండునని చక్కెరయను మాత్రము తిని ప్రాణు లు జీవింపఁజాలవుగదా. కావుననె మహాత్ముండగు పంతులయనూరి వచనప్రబంధములకుం దోవఁజూపె పిదప నిపుడు తమదర్శన భాగ్యంబు మాకొసంగి నయన పర్వంబొనర్చుచుండు మహాత్ముల[illegible] వచన ప్రబంధములనురచించి యీదేశమునకు శాశ్వతమైన [illegible]మేలొనర్చిరి. వీరేశలింగ కవిపుంగవులును నవలలను మనోహర కల్పితకథలకు మార్గదర్శకులగుటయు గాక ప్రకృతి శాస్త్రరచన యిట్టిదంచును దెల్పిరి.

సద్గురు వరేణ్యులారా?

ఇట్లు మీరెల్లరుచూపిన త్రోవనే మేమిప్పు డ్రొక్కుచున్న వారము. మనము ప్రకటించు నేగ్రంథమైనను కేవలము వినోదమునకుఁగాక దేశము న కేదేనొక గొప్ప మేలు సేయఁగల్గుటకె యుద్దేశింపఁబడి యుండవలయుగదా. మనము మనమాతృ దేశము కొఱకెట్టి ఘనకార్యంబు లొనర్చి మన జీవితంబులను సార్థకంబుగ నొనర్చుకొన వచ్చునో తెలుపుమహాపురుష జీవితంబులును మనదేశంబు తనదు నికృష్టదశనుండి వెలువడిరెట్టి మార్గంబు

ల నవలంబించినఁ దనతోడి దేశములలోఁ గలయెత్తి తిరుగఁగల్గునో చూపఁగల్గు నానాదేశచరిత్రలును, మనచుట్టునున్న ప్రకృతి యొక్క సత్యస్థితి మనకుం గోచరమగునట్లొనర్చి ప్రకృతి శక్తులననాయాసంబుగ మనవశముఁ జేసికొనఁగల్గు రాజమార్గంబులఁ బ్రకటించి మనుజులను సత్యశాస్త్రజ్ఞాన తేజోవిరాజితులుగ నొనర్పఁ జాలియుండు ప్రకృతిశాస్త్రములును కను నిట్టి యితర ప్రయోజనంబుల కొఱకుద్దేశింపంబడిన గ్రంథ రాజంబులను బ్రకటించుటవలననె నిక్కువంబుగ నాంధ్రభాషాభివృద్ధియు దేశాభివృద్ధియుఁ జేసిన వారమగుదుము.

గ్రంథ రాజంబులిట్టుండ పద ప్రయోగంబుఁగూర్చి యొక మాట చెప్పవలసియున్నది: అతిదీర్ఘసమాసముల నల్లనపేక్షింపక, శ్లేష యమకరచనలకొఱకుపాటుపడక తేట తెలుగు మాటలతో అర్థాన్వయసౌలభ్యం బొదవవిషయంబు గనులఁగట్టినట్లు విస్పష్టంబుగఁ దోచునట్లు వ్రాయుటయె మనభాషకు మేలొనర్చుటగుఁగాదె? అయిన నసాధువులగు శబ్దరూపంబులను వాడుటయైన స్వభాషా సంప్రదాయములను విడిచి యన్యభాషాజాతీయములను తెలుఁగున వినియోగించుటయైన యుక్తమనుట నా యుద్దేశమించుకయుఁగాదు. మనము వ్రాయునది తెలుగై యుండవలయుం గాని తెలుగును నింగ్లీషునుగాని యొకవింతభాషయై యుండఁజనదు. ఆంగ్లేయగ్రంథకర్తలును బత్రికాలేఖకులును నిర్దుష్టముగ నాభాషను వాడ నెంత యావశ్యకమంచు నెంచుచున్నారో మనమెఱుఁగుదుము. మనమును వారిభాషనట్లెవాడు టవశ్యకర్తవ్యముగ భావించుచుందుముగాదె? వారిభాషయందు వారికంత గౌరముండిన మనభాషయందును మనకంత గౌరవ మెట్లుండకుండు. అయిన నొక్కవిషయమును మనము మఱవఁగూడదు. మనభాషలోలేని క్రొత్తవిషయములను వ్రాయుచుండు నపుడు శబ్దములును గ్రొత్తవివాడ వలసివచ్చును. వస్తువు క్రొత్తదైనపుడు దానిని తెలుపుశబ్దము క్రొత్తదైన దోషంబెట్లగు? కావున నీవిషయమున సందియమించక పెద్దనాది పెద్దలుచూపిన మార్గము నవలంబించుచుఁ గ్రొత్తశబ్దములను వలసినచోటుల నెల్ల ధారాళముగ వాడుటయె మనభాషకు శ్రేయస్కరంబగునంచు భా

వించెద. పైనిచేర్కొనిన ద్రవిడభాషాసంఘమువారు పదార్థవిజ్ఞాన శాస్త్ర సంబంధశబ్దములు కొన్ని యేర్పఱిచిరి. తక్కినశాస్త్రములకును నట్టిపట్టికలు సిద్ధపఱుప బడునేని గ్రంథకర్తల కమితమగు సాహాయ్యమొదవినదగు (నాగరప్రచారిణి సభవారి పాత్రము తృప్తికరంబైయుండిన మనకీశ్రమ గల్గకుండును.) కావుననే తదర్ధమాంగ్లేయ భాషంజక్కఁగ నెఱుంగు కోవిదులగు కొందఱును సంస్కృతాంధ్రభాషావిదులగు పండితులు కొందఱును నొకసంఘముగాఁ గూడి ద్రవిడభాషాసంఘమువారు కొంతచేసివిడిచిన యుత్కృష్ట కార్యమును బూర్తిచేయఁ బ్రార్థించుచున్నాడను. ఈవిషయమునె కొన్నిదినముల క్రిందట బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిలు గారికి విన్నవింప వారీ కార్యమునకు వలయుసాయమెల్లఁ జేసెదమని ప్రీతిమెయి వచించిరి. సభాసదులగు తజ్ఞులయభిప్రాయంబులును నిట్టిదయగునంచు భావించెద. ఇట్లేర్పడనగు సంఘమువారు నూతనపదప్రపంచమునకు వాగనుశాసనులగుటయకాక నూతనగ్రంథములను బరిష్కరించుటయు దత్ప్రకటనమున కనుమతి యొసంగుటయు మహాభారతాద పురాతనగ్రంథరత్నంబులను దత్ప్రకటన కర్తలిచ్చవచ్చినట్టులనెట్లో దిద్ది ముద్రింపక ప్రామాణిక పాఠముల ననుసరించు నట్లొనర్చుటయుఁ గూడవారికవశ్యకర్తవ్యములగునంచు భావింతురుగాత. .

ఇట్లు మనభాషాభివృద్ధినిగూర్చి చెప్పవలసిన విషయములు చాల కలవు. గ్రంథవిస్తరభీతిచే వానిలో నొకటిరెంటిని స్మారకసూచించితిని. భాషాభిమానంబుచేఁ బురికొల్పఁబడి మముబోంట్లకు గ్రంథరచనయం దనుదినముగల్గుచుండు కష్టములు కొన్ని నిరూపించుచుఁగా కంచునిట్లువచింప సాహసించితి. ఇష్టదేవతాప్రసన్న మయినపుడు వరమడుగుట తప్పుగాదుగదా. సర్వేశ్వరానుగ్రహంబున నిట్టి సభలు తఱచు గూర్పఁబడుచుండుగాత. ఇట్టికకాలంబున మహాత్ములగు నిందఱు పండితులసందర్శన భాగ్య మొదవుటకవకాశం బొసంగిన శ్రీరాజా భుజంగరాయగారికిని, మాపురంబు నలంకరించి మములను ధన్యులుగ నొనర్చిన కోవిద శ్రేష్ఠులకును ఆంధ్రభాషాభివర్ధనీసంఘమువారు తమ మనఃపూర్వక వందనములనర్పించుచున్నవారు.

